# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 [illegible] 1-10-1981 సంచిక 23


—* ఈ సంచికలో *—



1—16—8] సంచికలో మంజరీ మధుకరీయము, యోజనగంధి – ప్రయోజనగంధి, ఫిరదౌసి పాత్రచిత్రణ, సాహిత్యంలో కార్మికుడు మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురించబడును *—

చందా :
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.


## మొల్ల కవితా పటిమ

- శ్రీ ఎ. క్రిష్ణప్ప, బి. ఎస్‌సి., ఎం. ఏ.

'బహు భాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతబద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహు యాగంబుల ఫలంబు పరమార్థ
మగున్' [1-17 భారతము]

అని నన్నయ భారతావతారికలో భారతాన్వయముగ జెప్పెను. ఈ భావము రామాయణ, భాగవత కావ్యాలకుకూడ సరిపడును. రామాయణమును బహుభాషలలో బహు విధములుగ అనేక కవులు వ్రాసియున్నారు. తెలుగుభాష లోనే చాలమంది రామాయణమును రచించినారు. అందులో సరళభాషలో సర్వజనుల.కర్థమగునట్లు వ్రాయబడినకావ్యము మొల్లరామాయణము. మొల్ల ఆంధ్ర రామాయణ రచయిత్రులలో నాద్యురాలు. మొల్ల ఆతుకూరి కేసనసెట్టి వరపుత్రిక యని, గోపవరపు శ్రీకంఠ మల్లేశు వరముచేత కవిత్వ మబ్బిన దని తన రామాయణ ప్రారంభములోఁ జెప్పుకొనెను. రామాయణము నెందరెన్ని విధముల చెప్పినను నది క్రొత్తగా నుండును. అందుకే మొల్లకూడ రామాయణ ప్రాశస్త్యమును గూర్చి యిట్లు చెప్పినది.

'ఆది రఘురామ చరితము
నాదరముగ విన్న గ్రొత్తయై లక్షణ సం
పాదమై పుణ్యస్థితి
వేదమై తోచకున్న వెఱ్ఱిసె చెప్పన్'
[మొ.రా.పీఠిక 20]

మొల్ల నెల్లూరు దగ్గర ఉన్న గోపవరం నివాసిని యని కొందఱు, కడపజిల్లాలోని బద్వేలి సమీపమునగల ఆతుకూరునివాసిని యని మరికొందఱు చెప్పిరి. మొల్ల పూర్వీకులు మొదట ఆతుకూరులోనుండి, తర్వాత గోపవరమునకు తరలివచ్చి స్థిర నివాస మేర్పరచికొని యుండవచ్చును. కాబట్టి ఆతుకూరు మొల్ల గోపవరము నివాసిని యనుట సమంజస మనిపించును. ఇట్లే ఈమె కాల నిర్ణయ విషయములో గూడ భిన్నాభిప్రాయములు గలవు. ఈమె స్తుతించిన ఆంధ్రకవులను వరుస క్రమములో బేర్కొనకపోయినను శ్రీనాథుని వరకే స్తుతించుట వలన మొల్ల శ్రీనాథుని తర్వాతికాలమునకు సంబంధించి యుండవచ్చునని తలంపవచ్చును.

'స్తుత గుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజుల వాగ్ధుర్య నన్నపార్య
రసికుడైనట్టి శ్రీనాథు రంగనాథు
దిక్కకవి రాజును నుతించి దీనిమించి
[మొ. రా. పీఠిక 9]

మొల్ల స్తుతించిన ఆంధ్రకవులలో నాంధ్ర రామాయణ రచయిత లిద్దరున్నారు. వారు తిక్కన, రంగనాథ కవులు. ఈమె రామాయణ రచనకు రంగనాథ రామాయణము మిక్కిలి ఉపయోగపడి యుండును.

సంస్కృతమును దెలియరాకుండ తెనిగించుట, తోచని అర్థముతో గూఢ శబ్దములు చెప్పుట ఈమెకు నచ్చవు. మొల్ల కుఁదేటల మాటలతో గ్రొత్తరీతులతో బొలుపు వహించునట్లు పొందించుట, సరళమైన మాటలతో నందముగాఁ గూర్చుట యిష్టమైనట్లు కావ్యారంభములో బేర్కొన్నది.

'కందువ మాటలు సామెత
లందముగాగూర్చి చెప్పునది తెనుగునకున్
బొందై రుచియై వీనుల
విందై మఱి కానిపించు విబుధుల కెల్లన్.'
[మొ. రా. పీ. 18]

మొల్ల స్తుతించిన కవులలో పోతన పేరు పేర్కొనలేదు గాని, ఈమె శైలి ఎక్కువగ పోతన శైలిని పోలియున్నది. పైగా మొల్ల పోతన లిద్దరును రాముడు పల్కించుట వలననే కవిత్వము చెప్పినట్లు వారు చెప్పుకొన్న క్రిందిపద్యముల వలన తెలియును.

'పలికెడిది భాగవత మట
పలికించెడివాడు రామభద్రుం డట; నేఁ
బలికిన భవహర మగు నట
పలికెద వేఱొండుగాథ పలుకగ నేలా!'
[పో.భా. 1-18]

'చెప్పుమని రామచంద్రుడు
సెప్పించిన పలుకుమీదఁ జెప్పెద నేనె

ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్య చరిత్ర తప్పు లెంచకుడు కవుల్'
[మొ.రా.పీ. 13]

మొల్ల పోతనవలె తన రామాయణమును రామాంకితముచేసినది. మొల్ల కంద, సీస పద్యరచనలో పోతనను అనుకరించినట్లు కనపడును. మొల్లరామాయణములోని 'చని చని యెదుటను రాముడు, గను గొనియె' అను పద్యము 'పావని కను గొనె నప్పుడు పావన విఖ్యాత సుగుణ భావోపేతన్' అను పద్యము పోతనభాగవతములోని 'చనిచని ముందట గనుగొనె ఘన పాప తమః పతంగ గరుణాపాంగ' అను పద్యమును దలపింపజేయుచున్నవి. ఇట్లే మొల్ల రామాయణములో శ్రీరాముని గూర్చిన 'నీలమేఘచ్ఛాయ బోలుదేహమువాడు, ధవళాబ్జపత్ర నేత్రములవాడు' అను వర్ణనము పోతన భాగవతములోని 'నల్లనివాడు, పద్మనయనంబుల వాడు, కృపారసంబుపై జల్లెడువాడు' అను వర్ణనమును దలపింపజేయుచున్నది.

మొల్లరామాయణమును సంక్షిప్తరూపమున రమణీయముగ రచించెను. బాల, అయోధ్యా, అరణ్య, కిష్కింధాకాండములను సంక్షిప్తముగ, సుందర, యుద్ధకాండములను విస్తృతముగ చెప్పెను. మొల్లపాత్రల మనోభావములను మనోహరముగ సరళపదములతో చిత్రించి, హృదయములం దాహ్లాదముప్పొంగి వెల్లువ వలె ప్రవహింపజేయును. మాయలేడిని చంపి ఆశ్రమమునకు తిరిగివచ్చి అందు సీత కనపడకపోగా రాముడు విలపించిన తీరు హృదయ విదారకముగ నున్నది.

'పర్ణశాలలోనం బరికించి పరికించి
సీత గాన పడమి జిన్నవోయి
చిత్తమంత గలగి శ్రీరామచంద్రుండు
పలవరింప జొచ్చె భ్రమసి భ్రమసి'
[మొ. రా. అ. 51]

ఇక్కడ శ్రీరాముని ఆత్రము, సీతపై నున్న ప్రేమ వ్యక్తమగుచున్నవి. చిన్నబోయిన మనస్సు, పలవరింపులు కన్నులకు గట్టినట్లు సహజ ధోరణిలో మొల్ల సాక్షాత్కరింప జేసెను. ఇట్లే విలపించుచున్న శ్రీరాముని ఓదార్చు సందర్భములో లక్ష్మణుని చేత పలికించిన తీరు కూడ సందర్భోచితముగ, రమ్యముగ నున్నది.

'భూతలమున నాకసమును
భాతాళంబును నెమకియో బోధించియో నే
సీతను దెచ్చెద పిమ్మట
సీతమ్ముడ ననుచు మెచ్చ నిఖిలోర్వీశా'

ఇందు లక్ష్మణుని కోపము, బలపరాక్రమము, అన్నవదినెలపై నున్న ప్రేమ, గౌరవము వ్యక్తమగుచున్నవి.

మొల్ల శబ్దార్థాలంకారములకు నైకవ ప్రాధాన్య మిచ్చి వీనులకు విందును, హృదయమున కాహ్లాదమును గల్గింప జేసెను. రామరావణ యుద్ధమును వర్ణించిన తీరు శబ్దాలంకారయుతమై సందర్భోచితమై, యొప్పుచున్న దీ క్రిందిపద్యమున;

'గిరి గిరి నభము నభంబును
ధరధరయును జలధి జలధి దార్కొనురీతిన్
సురరిపుడు నసురరిపుడును
దురమున నెదిరించి రథిక దోర్బలయుక్తిన్'
(మొ. రా. యు. 53)

ఈపద్యము చదువుచుండ, నిజముగా యుద్ధముచేయునప్పుడు కలుగుశబ్దములను దలపించును. ఈ పద్యము భాస్కర రామాయణములోని 'సరిబాహా బాహి నిర్భగ ముష్టీముష్టి' అను పద్యమును దలపింపజేయుచున్నది.

మొల్లకు అర్థాలంకారములన్న అభిరుచి మెండుగాగన్పించుచున్నది. ఈమె సామాన్యోపమానములతో, సరళపదములతో, మధురభావములతో వర్ణించును. అయోధ్యా కాండములో ప్రారంభములోని సూర్యాస్తమయ వర్ణన మిట్లున్నది.

'పగలు ప్రాగ్భాగమున నుండి గగనవీథి
జరమ దిక్కునకేగగా శ్రమముదోచి
చెమట పట్టిన స్నానంబు జేయ నరుగు
కరణి నపరాబ్ధిలో దివాకరుడు గ్రుంకె'
(అ. 6)

సూర్యుడు ఆకాశవీథిలో తూర్పునుండి పడమరకు ప్రయాణము చేయునప్పుడు పట్టిన చెమటను బోగొట్టుకొనుటకై సముద్రములో స్నానము చేయుటకు వెళ్ళినట్లున్నదట సూర్యాస్తమయము. ఈ వర్ణనము జరుగబోవుకథను ధ్వనింపజేయుచున్నది. శ్రీరాముడు తండ్రికోరికపై అడవులకు వెళ్ళునను భావము కావ్యార్థ సూచనను ఇక్కడ ధ్వనింపజేయుచున్నది. అట్లే మొల్ల సూర్యుని అద్దముతోను, చీకటిని కాటుకతోను బోల్చి వర్ణించెను.

మధువనమున కపివిజృంభణము స్వభావోక్తి భరితమై యొప్పారుచున్నది. కపులను సరళశైలిలో వర్ణించిన తీరు క్రింది పద్యమున గోచరించును.

'కాయల వ్రేటులాడుచును
గంతులువైచుచు బూవు తీవలం
దూయల లూగుచు న్దరువు
లూపుచు బండ్లను బొట్లనిండగా
మేయుచు వెక్కిరింపుచును
మిన్నకదాటుచు దోక లెత్తుచుం
గూయుచు నేల దూకుచును
గుంపులు గూడి కపీంద్రు లెంతయున్'
(మొ. రా. సుం. 234)

పైపద్యమున మొల్ల స్వభావసిద్ధమైన కోతిచేష్టలను కళ్ళకు కట్టినట్లు రమణీయముగా వర్ణించెను.

మొల్ల సామెతలను, లోకోక్తులను ఉపమానములుగా వాడి పాఠకులహృదయములలో సరియైన భావ మేర్పడునట్లు చేయును. దానవవీరులు కపివరు మీద బాణములు వదలినతీరు వివిధముగ మొల్ల వర్ణించెను.

'అప్పుడు దానవవీరులు
నిప్పులు వర్షించునట్టి నిశితాస్త్రములం
గప్పిరి కొండొగ వానల
గప్పిన శైలంబు బోల గపివరు మీదన్'
(మొ.రా.సుం 172)

కపివరుమీద మీద నిప్పులు వర్షించునట్టి బాణములు దానవవీరులు వదలిరి. కాని అవి కొండమీఁదఁ గురిసిన వాన వలె వృథా అయినవి. కపివరుని కొండతో బోల్చుట చెప్పదగినది. 'వానల గప్పిన శైలంబు బోల' అనేది 'కొండమీద కురిసినవాన' అను సామెతకు ప్రతీక. ఇట్లే మొల్ల 'దొంగిలి కొని పోవఁ దగునె దొరలకు', మానము సెడి వగవనేల, మగతనమును విడిచి నడువ మగువలు నగరా,' మొదలైన లోకోక్తులను కథలో నతుకునట్లు వాడెను. ఈమె రామాయణమునందు వ్యావహారిక భాషా ప్రయోగాలు మిక్కుటముగా వాడి, సామాన్య జనులకు సైత మర్థమగునట్లు రచించెను. కుయ్యో, మొఱ్ఱో, సందులు గొందులు మొదలైన ప్రయోగాలు వ్యావహారికభాషా ప్రయోగమున కుదాహరణములు.

మొల్ల కొన్నిచోట్ల వ్యతిరేకశబ్ద ప్రయోగములతో చమత్కరించెను. శూర్పణఖచే సీతను గూర్చి చెప్పించిన తీరు చూడవలయును.

'కలదో లేదో యనుచును
బలుమఱు నెన్నడుము జూచి పలుకుదు
రితరుల్
బలియో కలియో యనుచును
బలుమఱు జఘనంబు జూచి పలుకుదు
రితరుల్.'

సీత నడుము 'కలదో లేదో' అన్నట్లున్నదట. సీత జఘనము 'బలియో కలియో' అన్నట్లున్నదట. అనగా సీత నడుము సన్నమనీ, జఘనము పెద్దదని చమత్కారము. తద్ద్వారా సీత సౌందర్యము కన్నులకు గట్టినట్లు వర్ణించుట గమనించదగిన విషయము.

ఈవిధముగ మొల్ల కవిత్వము స్వభావసిద్ధమై మనోహర భావబంధురమై ఔచితీసహమై, హృద్యమై యొప్పారుచున్నది. రామాయణము నేరచయిత రచించినను వారి పేరుమీదుగనే వెలువడుట విశేషము. ఈమె రామాయణము కూడ నీమెపేరు మీదుగనే 'మొల్ల రామాయణ' మని ప్రఖ్యాతి గాంచినది.

— ... —

# సాహిత్యంలో అహల్య

- శ్రీమతి పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం.ఏ., పిహెచ్.డి.

( గతసంచిక తరువాయి )

అహల్యా వ్యక్తిత్వమును ప్రబంధధోరణిలో నాటికాలమున కనుగుణముగ తీర్చిదిద్దిన కావ్యము సముఖము వేంకటకృష్ణప్పనాయకుని 'అహల్యా సంక్రందనము' ఇందు అహల్యను బ్రహ్మ సృష్టించుటకు కారణము దేవతల అభిప్రాయములు, ఋషుల వాగ్వాదము. అహల్యా సౌందర్యమును చూచి దేవతలు తమ అనిమిషత్వమును సార్థక పరచుకొనినారు. అట్టియెడ తండ్రికి సమీపమున కూర్చుని యున్న అహల్య దేవేంద్రుని సౌందర్యము చూచి మోహించినది. కాని తండ్రి ఆమెను గౌతమున కిచ్చి వివాహము చేసినాడు. అందువలన అహల్యకు మనువొకచోట, మనసొకచోట నైనది. పనిదీరిన వేళ మదిలో 'అవియచ్చర వల్లభురూప సంపదలె' ఆమెకు స్మరణమైనది. యజ్ఞములందు ఇంద్రుని గుణ ప్రశంసనములు సాదరముగ వినుచుండెడిది. శచికాపురమే కాపురమని మెచ్చుకొనుచు, తన అందమును చూచి నిట్టూర్పులు విడుచుచుండెడిది. 'వేళయెఱింగి రతి భేదముల్ దనియించి యల్గినన్ బాళిని బుజ్జగించి రస భావములన్ కలిగించు' నాయకుడు అదృష్టవతులగు ఇంతులకు మాత్రమే లభించు నని కుందుచుండెడిది. వెనువెంటనే తనస్థితి తలచి, మహర్షి పత్నియగు తనకిట్టి తలపోతలు అధర్మమని భయపడుచుండెడిది. ఇట్లే రెండుభావములకు కలిగిన సంఘర్షణ ఈ కావ్యమునందు మనోహరముగ వర్ణింపబడినది.

ఇంద్రుని దూతికయై, ఘటనాఘటన కోవిదమతియగు ఒకయోగిని రాగా, 'ఇంద్రుడెవ్వడు' అని ప్రశ్నించి 'మూలనున్న తన్ను ముంగిటి కీడ్చుట తగనిపని' అని పలికినది.

'వేది యలంకరించుటయో,
వేల్మికమర్చుటయో, హవిస్సులన్
బ్రోదిగ చేయుటో, కుసు-
మముల్ గొనితెచ్చుటో, దేవపూజక
గ్రోదక మాహరించుటయో ...'

'తప్ప ఇటువంటి సద్దులజోలికి తాను పోవునట్టిది కాదని పలికినది. సతికిన్ ముఖ జేపట్టిన పతినొక్కరు, దక్కనితరు బాటించుట సంగతియట వే నీకింతటి మతి దిటవే యిట్లు నుడువ మర్యాదటనే' అని పతివ్రతగ నటించి 'అప్సరాది జనముల వలె నాగరకత లేని తాపసి యిల్లాలిపై ఆటువంటి దొరలు వగలు చెందుట' మర్యాదకాదని పలికినది. కాని యిట్టి స్థితి ఆమెయందును ఎంతో సమయము నిలువలేదు. ఇంద్రునిపై తనకు కోరిక కలదని చివరకు వెల్లడించినది. 'ఏపరాధీన గావున నింతవంతఁ గ్రాగు చుండంగవలసెనుగాక యున్న నెఱుకలను గట్టికొనియైన నెగసివచ్చి తనయెదకు వ్రాలనో చిల్కతాళికలేను.' అని పలికినది. తనకు ఇల్లే కారాగృహమైన దని వివరించినది.

'చక్కనివా డింటి చాయకు వచ్చిన
మామగారూ రకమండి పడును
పుట్టింటిలోనొక్క పూట యుండగరాదు
కత్తిలోతగ బోరు నత్తగారు
నిమిషంబు పొరుగింట నిలచియుండగ
రాదు
పటుకార్లబట్టును వదినగారు
కడకుబోయిన నొక్క కడనుండగారాదు
మఱదలు కొండీల మారి బసివి
తోడికోడండ్రు చూపోపకాడువాండ్రు
పట్టబగ పట్టి పోరాడు బావగారు
జారసంగతిఁ గాంక్షించు చంద్రముఖికి
నత్తగారిల్లె కారాగృహంబు దలప'

ఇట్లు ఈ కావ్యమున అహల్య లోక సామాన్య యగు వనితవలె, కోడంట్రిక మనుభవించు గృహిణి యైనది.

ఇంద్రుడు గౌతమరూపధారియై రాగా ఆతని గుర్తించినది. ముని పత్ని మగనాలగు తనను భువనమాన్యుడగు ఆతడు కామించుట చూచిన సురలు పరిహసింతురని, మునిరాజు వినినచో మోసమగునని పలికెను. ఆతడు తన పదములపై వ్రాలగా 'దేవుడ వేలిన సామివి పోవయ్యా నీవు నాకు మొక్కంగ దగునా' అనిపలికి రసాల సాలము నల్లెడు మల్లియతీగగా మారినది. గౌతముడు ఈ విషయమును గ్రహించి 'బలా, రాతిని కోరికూడితివి రాతిరిజామున గావునన్ బలా, రాతి శరీరమందు, మని శపించినాడు. చివరకు అన్ని కావ్యములందు ఉన్నట్లుగా, ఈ కావ్యము నందును రామదర్శనముచే శాపాంతము పొంది, గౌతమునితో కూడి 'యింతింతనరాని సౌఖ్యముల' ననుభవించినది

ఇట్లు ఈ కావ్యమున ఆమె సృజింపబడిన మరుక్షణము నుండియు ఇంద్రుని వలచిన ప్రణయినిగా, భర్తతో అతని కుటుంబము మధ్య కోడంట్రిక మనుభవించు సామాన్యగృహిణిగా, దేవరాజు నందలి మోహముచే మునిరాజు ఆధిక్యమును గుర్తింపలేక తన కాపురమును నిస్సారము చేసికొనిన మోహవతిగ, అధర్మ ప్రవర్తనమను భయమున మునిరాజు నెడగల భక్తిచే దేవరాజుపైగల తన కోర్కెల కొమ్మలను విరచివైచినను, యోగిని పలుకులచే, నిజజీవితమును తలచికొని, ఆశాపుష్పములను విరియింపచేసికొని తన కోర్కెలు పండించుకొనిన కాముకిగా ఈమె వర్ణింపబడినది. ఇఁక అన్ని గ్రంథములందువలె గౌతమునిచే శపింపబడి రామపదధూళిచే పవిత్రయైనది.

తెలుగు సాహిత్యమున వెలసిన మరియొక గ్రంథము 'విచిత్రరామాయణము' పేరుకు తగినట్లుగ ఇందలి కథలు చిత్రవిచిత్రగతులలో నడచును ఈ కావ్యమున గౌతముడు మంత్రకోవిదుడు. ఆయనకు భార్యపై అనుమానము. అందువలన కార్యార్థియై ఆతడు గృహమునుండి వెడలునపుడు అహల్యప్రాణములు కొనిపోవుచుండును. తిరిగివచ్చి బ్రదికించుచుండును. గౌతముడు మాయాకుక్కుటము కూతను విని, దయితప్రాణములు తీసికొని స్నానార్థియై వెడలగా, మహేంద్రకమలాప్తులు అహల్యను కూడిరి. గౌతముడు తిరిగివచ్చి భార్యను బ్రదికించినాడు. పిమ్మట అహల్యకు ఇరువురు కుమారులు కలిగినారు. అంతకు పూర్వమే అహల్యా గౌతములకు అంజన అను కుమార్తె గలదు. ఒకనాడు గౌతముడు ఆకుమారులతో కుమార్తెతో, సముద్రమునకు పోవుసమయమున అంజన కుండులగు తనయుల నెత్తికొనుచు యుష్మదాత్మజాతనయిన నన్ను నడిపింపదగునె' అని పలుకగ, ఆతడు నిజమును గ్రహించి దిననాథ మహేంద్రులను శపించినాడు. పిమ్మట గృహమునకేగి అహల్యను గద్దించినాడు. అపుడామె 'నేను విగతాసుకనై యుండ ఎవ్వరేమి సలిపియున్నను నాకగోచరము' అని అతనితో పలికి 'నీవు పుత్రివైయుండి తండ్రితో బొంకు లాడితివి కనుక వానరత్వము పొందుమని అంజనను శపించినది. అంత గౌతముడు 'పాపముచేసి వృథాపుత్రిని శపించితివి, గాన శిల వగుమని' శపించినాడు. చివరకు ఆమె ప్రార్థనపై రామదర్శనమును శాపమోక్షముగ పలికినాడు. ఇట్లీకావ్యమున అహల్యా వృత్తాంతమతి విచిత్రము.

ఇట్లు ఊహాలోక నివాసులగు పూర్వకవులచేత రకరకములుగ అల్లబడినది అహల్యకథ. అంతేకాదు. తార్కికులగు ఆధునిక కవులకుకూడ ఆమెకథ కావ్యవస్తువైనది. ఇది ఆశ్చర్యకరమగు విషయము. కాని ఆధునికకవుల కరస్పర్శతో అస లామె కథయే మారినది.

అమలిన శృంగారమే ధ్యేయముగా పెట్టుకొనిన రాయప్రోలు సుబ్బారావు 'రూపనవనీతము' అను తనకావ్యమున అహల్య పాత్రను చాల ఉదాత్తముగ చిత్రించినారు. ఆమె శీలదానము చేసిజీవితము సమాప్తి నొందించుకొని కర్ణుడు బలి మొ॥లగు మహాదాతలస్థాయిని పొందినట్లుగ ఈయన చిత్రించినారు.

'సంగీత సాహిత్యముల సరిచూచిన త్రాసు' అని ప్రసిద్ధి నందిన ఆదిభట్ల నారాయణదాసుచేసిన మార్పు స్వరూపమునే మార్చినది. గౌతముడు చేయు ఘోరతపమునకు భంగము కలిగించుటకు ఇంద్రుడు యత్నించి, ఆతాపసి వేషధారియై వచ్చి అహల్యను ప్రలోభపెట్టుటకు యత్నించినాడు. ఆమె తన సతీత్వమహిమవలన వేయికనుల ఆనవాలుని, ఆతనిని యింద్రునిగా గుర్తించి, అతని ప్రవర్తనను శంకించినది. 'ఇంత దుర్బుద్ధి ఏలపుట్టె నీ కిపుడో వేల్పుఱేడ, సుంతయైన నొప్పుకొందువా నీ సుదతి న్పరుండుకూడ' అని ప్రశ్నించినది. అంతేకాదు. పూర్వసాహిత్యమున ఇంద్రుని చూడగనే మోహపరవశయైన అహల్య నారాయణదాసుగారి పెంపకములో

పరమపతివ్రతయై ఇంద్రుని నిందించు ధీర యైనది.

స్వార్థపరులు రాజులక్కట తమకార్య
  సిద్ధికై యితరుల జెఱచుచుందు
రక్షపాదున కెట్టులైనఁ గోపంబు దె
  ప్పించి యాతం డొనరించు తపము
పాడుచేయుట కిట్లు పన్నితివా! పట్టి
  రట్టు నాపై నీఁక బట్టు కనుక
స్వయముగా ధర్మదేవత వచ్చినన్నంటు
  వఱకు బాషాణరూపమున నుందు'

వనుచు తన సతీత్వ మహిమమున అహల్య శిలాకృతి వహించినది.

ఇట్లు ఇందు అహల్య శిలాకృతికి కారణము గౌతముని శాపముకాదు. ఆమె తనకు తాను చేసికొనన ప్రతిజ్ఞ. ఆ ధర్మదేవతవచ్చి తన్నంటు వరకు శిలగనుండు దునని తలఁచుట దుష్టబుద్ధియైన ఇంద్రుని శపింపకుండుట – ఆమె అంతర్ముఖియై తన పాతివ్రత్యనిరూపణమునకు తీసికొనిన నిర్ణయములు. ఇట్లు వాల్మీకినుండి విశ్వనాథవరకు గల కవుల చేసిన అహల్యా చిత్రణమును నారాయణదాసు గారి కమనీయ రూపకల్పన పరాస్తముచేసి అహల్యను సతీసావిత్రితో అనసూయతో సమాన స్థాయియందు కూర్చుండబెట్టినది.

ఇట్లు అహల్య పాత్రను ఒకానొక కరుణ రసార్ద్ర దృష్టితో పరికించి ఆ పాత్ర కొక విశిష్టతను చేకూర్చినారు ఆధునికులు.

ఈవిధముగ సాహిత్యమున రామమహిమాభి వర్ణనమునకు ఉపబలకముగాకల్పింపబడిన ఒక ఉపకథ అహల్యచరిత్ర. ఈ ఉపపాత్ర కాలక్రమమున ఎన్నియో రూపములను పొందినది. ఇన్నిమార్పుల వెనుక ఆదికవి ఉద్దేశించిన అంతరార్థము అనుస్యూతముగనే ఉన్నది. తత్త్వచింతనయే ఊపిరిగాగల భారతీయులకు ఈకథ ఒక అధ్యాత్మమార్గమును చూపుచున్నది. బ్రహ్మదేవునకు సాక్షాత్తు పుత్రికయు, ఆశ్రమవాసినియు, నియమనిష్ఠలకు ప్రతినిధియు గౌతముని ఇల్లాలు అగుటచే ఈమె యందు మనస్సంయమనము స్థిరత్వము ఉండవలయును. కాని ఇంద్రుని సౌందర్యమునకు ఈమె చాంచల్యము పొందినది. అనగా ఇది తాపసధర్మాతిక్రమణము. ఉపరి స్త్రీధర్మాతిక్రమణము. నైతిక నియమములను ఉల్లంఘించినవారు ఎవరికైనను శిక్ష అనుభవింపక తప్పదు. అందువలననే గౌతముని శాపము. నిశితముగ ఆలోచించిన ఇదిశాప మనిపించదు. పతనావస్థనుండి ఆమెను పవిత్రస్థితికి మార్చుయత్నము. అంతేకాదు. భావిఫలమును పరికించిన ఆమెపాలిటివరము. మునిశాపముచే దుఃఖానుభవముచే ఆ మెయందు కలిగిన పశ్చాత్తాపము, ఆమెచేసిన దోషమునకు ప్రాయశ్చిత్తముగ మారినది. శాపానుభవము తొలగి పోవుటకు నియతిగ రామదర్శనము పేర్కొనబడినది. అందువలన ఆమె ఆ రాముడు ఎప్పుడు వచ్చునో, అని అతని రాకకై ఎదురుచూచుచు ఆ నామమునే స్మరించుట ప్రారంభించినది. ఆ నామస్మరణయే నామార్చనయైనది. తదేకాగ్రత భగవదారాధన యైనది. అదే తపస్సు. ఆమెపాపములనుక్షాళనముచేసిన తేజస్సు. భగవంతుడే ఆమెను వెదకికొనుచు వచ్చి దర్శనమిచ్చుట, శారీరక మానసిక దోషములు క్షాళితమైన ఆమె పవిత్రతకు నిదర్శనము. ఈ విధముగ ఎంతటి మహానీయుని వలన జన్మము పొందినను ఎంతటి మహానీయుని సాహచర్యము నందినను చేసిన కర్మము ననుసరించి ఫలమనుభవింపక తప్పదనియు, పరమేశ్వర సేవయందు లీనమైనచో ఎట్టిదోషమునైనను నశింపచేసికొని భగవత్సాక్షాత్కారము పొందవచ్చుననియు ఈ అహల్య చరితము నిరూపించుచున్నది.

ప్రాచీన సాహిత్యము చాలవఱకు సాంకేతికమైనదనివిమర్శకుల ఊహ. అట్టి దృష్టితో పరికించిన వేదములందు అహల్య, గౌతమ, ఇంద్ర, జారశబ్దములు ప్రతీకాత్మకములు. గౌతముడు చంద్రుడు, అహల్య చంద్రుని భార్యయగు రాత్రి. పరమైశ్వర్యసంపన్నుడగు సూర్యుడే ఇంద్రుడు. కనుక ఇంద్రశబ్ద వాచ్యుడగు సూర్యుడు ఉదయించగనే అహల్య అనగా రాత్రి నశించిపోవును. ఇట్లు వేదములందు ఈ శబ్దములు సూర్యచంద్రుల వలన దివారాత్రు లేర్పడుటను సూచించుచున్నవి. కాని ఈ అర్థము సాహిత్యమందలి అహల్య కథకు పొసగదు.

ఇట్లు రామాయణమునఁ బ్రకరిగఁ నున్న అహల్యకథ తాత్త్విక ప్రతీకాత్మక పరిణామ సిద్ధాంతములకు సమన్వయ రూపమై సాహిత్యమున ప్రధాన కథగ ప్రసిద్ధి నందినది.

— ... —

# సమస్యాపూరణరీతి వైశిష్ట్యము

— శ్రీ టి. రాజశేఖర కాశ్యప.

సంస్కృతాంధ్ర సాహిత్యములలో 'సమస్యాపూరణ' మనున దొక వినోదాత్మక కవితాప్రక్రియ. ఇది కాళిదాసాది మహాకవుల కాలము నుండి ప్రసిద్ధిలో నున్నది.

'సమస్య' అనగా 'కవి పరిజ్ఞాన పరీక్షార్థము పూరింప నిచ్చెడి పద్యాంశము' అని యర్థము. దీని నే ఆంధ్రమున కైపదము అని పిలుతురు. సమస్యను అమరకోశకర్త 'సమస్యా తు సమాసార్థా' అని నిర్వచించినాడు. ఈ వాక్యమునకు అమరకోశ వ్యాఖ్యాత యగు భానోజీ దీక్షితులు సమసనం సమాసః సమాసార్థోయస్యాః పూరణ సాకాంక్షా కవిశక్తి పరీక్షార్థ మపూర్ణత యైన 'పఠ్యమానా' యని వ్యాఖ్యానించినాడు. అనగా కవిశక్తిని పరీక్షించుటకై అపూర్ణముగా నీయబడిన పద్య భాగమునకు 'సమస్య' యని దానిని అర్థవంతముగా పూరణము చేయుట సమస్యా పూరణమని అర్థము. అంతేకాక మరొకరు 'సమస్యత ఇతి సమస్యా' అని నిర్వచించిరి. అనగా సరసార్థసమన్వయము చేయు గోరుట సమస్య. విరసార్థద్యోతకమగు నుడిని సరసార్థ ద్యోతకముగ నొనర్చుట సమస్యా పూరణము అని పై వాక్యమునకు అర్థము. కవి ప్రతిభా పరీక్షకొఱకిబడు వికృతార్థ బోధక చతుర్థ పాదమునకు సామాన్యముగా సమస్యయను పేరు చెల్లుచున్నది. కాని సమస్యలన్నియు చతుర్థ పాదములుగ నుండవు. పైనిర్వచనము అన్ని విధములైన సమస్యలకు వర్తించదు గావున 'సమస్యాతు సమాసార్థా' అను నిర్వచనమే సమంజసముగా నున్నది.

'సమస్యాపూరణము' కవియొక్క రచనా పాటవమును, ఊహాచమత్కృతిని, ధారాశుద్ధిని తెలిసికొనుటకు ముఖ్య సాధనమైయున్నది. నేడీ ప్రక్రియ శతాష్ట సహస్రావధానముల యందు ప్రముఖ స్థానము వహించి యున్నది. అవధానములయందు పృచ్ఛకులు అవధాని ప్రతిభా పరీక్షకై కఠినములైన, దుష్కర ప్రాసములతో గూడిన సమస్యల నిచ్చుచుందురు. (శార్ఙ్గ్యంఘ్రిస్మరణ చేత సౌఖ్యములబ్బున్ అస్ఖలిత బ్రహ్మచారి కార్గురు పుత్రుల్' మొదలగునవి దుష్కర ప్రాస సమస్యల కుదాహరణములు. ఇట్టిసమస్యలను పూరించుట విశేష పాండితీ ప్రభావసంపన్నులైన కవులకుగూడ అసాధ్యము.

ఈప్రక్రియ భోజమహారాజు ఆస్థానమున విశేష ఆదరణ పొందినట్లు లభ్యములైన అనేక గ్రంథముల వలన తెలియుచున్నది. కాళిదాసాది మహాకవులు భోజమహారాజుచే నివ్వబడిన అనేక విధములైన సమస్యలను చతురముగ, అర్థవంతముగా పూరణము చేసి తమ ప్రతిభను నిరూపించు కొన్నారు. ఇంతేగాక విజయనగర సామ్రాజ్యాధినేతయైన ఆంధ్ర భోజ శ్రీకృష్ణ దేవరాయల కాలమునుండి తెలుగు భాషలో గూడా ఈప్రక్రియ వ్యాప్తిలో నున్నటులు; పెద్దన, ధూర్జటి, తెనాలిరామలింగము మొదలగు అష్టదిగ్గజ కవులు తమకిచ్చిన సమస్యలను పూరించి రాయల మన్నన సత్కారములను పొందినట్లు తెలియుచున్నది. ఈశతాబ్దారంభమున గద్వాల, పిఠాపురం, విజయనగరం వంటిపెద్ద సంస్థానములలో ప్రతియేడు నిర్వహింపబడు చుండెడి విద్వద్గోష్ఠులలో పాల్గొనుటకు వచ్చెడి కవి పండిత మండలికి అనేక విధములైన సమస్యల నిచ్చి, వారి చేత పూరణము చేయించి వారిప్రతిభకు ఉచిత రీతిని పారితోషికముల నిచ్చి సంత్కరించెడివారు.

ఇక 'సమస్యలు ఎన్ని విధములు? వాటి తీరుతెన్ను లేమి? యను విషయము సోదాహరణముగా పరిశీలింతము.

సమస్యలను నిర్దుష్టముగా ఏకపాద సమస్య, ద్విపాద సమస్య, త్రిపాద సమస్య, చరణైక దేశసమస్య, పదసంఘాత సమస్య, నిర్దిష్టపద సమస్య, నిషేధ పూర్వక సమస్య, సరళ సమస్య, అను భాగములుగ విభజింప వచ్చును.

ఏకపాదసమస్య : ఈసమస్యలో సర్వసాధారణముగా పద్య చతుర్థ పాదమే యుండును. (ఉదా॥ భల్లూకము కడుపులోన భానుడు గ్రుంకెన్, భామాకుచమండలంబు భస్మం బాయెన్ మొ॥నవి) మొదటి, రెండు మూడు చరణములను సమస్యలోని వికృతార్థము తొలగునటుల పూరించుట ఏక పాదసమస్య. అవధానములందు ఈ ఏక పాద సమస్యలనే ఎక్కువగా నిత్తురు. పూర్వమొక కవికి 'కప్పను జూడంగ పాము గడగడ వడకెన్' అను సమస్య నివ్వగా

కప్పల కావలి బోవను
చెప్పులు కట్టయును బూనిశీఘ్రముతోడం
జప్పుడగుచు వచ్చెడి వెం
కప్పను జూడంగ పాము గడగడ
వణకెన్'.

అని పూరించినాడు కప్పనుజూచి పాము గడగడ వణకుట ప్రకృతి విరుద్ధము. పై వికృతము తొలగునటుల కవి,' వెంకప్పను జూచి పాము గడగడ వణకెన్' అని అర్థయుక్తముగా పూరించినాడు.

ద్విపాదసమస్య: ఇందు శ్లోకము యొక్క మొదటి చరణములో సమస్య ఉండును. ఇవ్వబడిన సమస్యకు అర్థము కల్పించి రెండవ చరణముతో పూరించుటను ద్విపాద సమస్య అందురు. మహాకవి కాళిదాసునకు, 'కుసుమే కుసుమోత్పత్తిః శ్రూయతే న తు దృశ్యతే' యను ద్విపాద సమస్య నివ్వగా;

'వసు మే వసు మోత్పత్తిః
క్రూయతే న తు దృశ్యతే॥
బాలే తవముఖాంభోజే
చక్షురిందీవరద్వయం'

అని పూరించినాడు. పైశ్లోకములో సమస్య మొదటి చరణము కాగా రెండవ చరణము పూరణ మైనది 'పుష్పములో పుష్పముద్భవించుట కనలేదు వినలేదు' అని సమస్యార్థము కాగా 'ఓ బాలా! నీ ముఖ పద్మమునందు కన్నులను కలువలు పుట్టినవి అని పూరణార్థము.

త్రిపాదసమస్య: వివిధ శ్లోకములలోని చరణాలను మూడింటిని సందర్భ శూన్యముగా దెచ్చి ఒక చోట నుంచి నాల్గవ చరణమును అర్థయుక్తముగా పూరించి, సందర్భమును కల్గింపజేయుటను త్రిపాద సమస్య అందురు. 1 అనిత్యాని శరీరాణి 2 శాకాయ లవణాయ చ 3 కూజంతం రామరామేతి యను సందర్భ శూన్యములైన మూడు చరణములను ప్రసిద్ధ పండిత కవి సార్వభౌములు శ్రీనడిమింటి సర్వమంగళ శాస్త్రిగారికిచ్చిరట. ఆయన -

'అనిత్యాని శరీరాణి
శాకాయ లవణాయ చ
కూజంతం రామరామేతి
మత్వామాగా గళేవః'

అని పూరించిరట. పై అసందర్భ వాక్యములను 'మత్వామాగా గళేవః' అని చతుర్థపాదముగా పూరించి అసందర్భ వాక్యములకు సందర్భమును కలిగించినారు. పై శ్లోకమునకు 'అనిత్యాని శరీరాణి మత్వా శాకాయ లవణాయ చమాగాః కూజంతం రామరామేతి గళేవః' అని సమన్వయము. శరీరములనిత్యము లని ఎరిగి శాకపాకములకై అనగా ఉదర పోషణమునకై కాలమును గడుపక, రామనామ స్మరణము చేసికొనవలసిన దని యర్థము. సంస్కృత సుభాషితరత్న భండాగారమను గ్రంథమున ఇట్టి ఉదాహరణముల నెన్నిటినో తెలుసుకొనవచ్చును.

చరణైకదేశ సమస్య: ఏదేని చరణమునందలి పాదమునిచ్చి పూరింపజేయుటను చరణైకదేశము లేదా పాదైకదేశము అని అందురు. 'చూతుమె? లవుడా?' 'కందని కల్కికైవడిన్' అనునవి చరణైక దేశమున కుదాహృతులు చూతుమె లవుడా! అనుసమస్య నొక కవి-

ఖ్యాతిగల రామచంద్రుడు
పూతాత్ముని మౌనిఁ జూడ బూనిక మీరన్!
చేత మెలర్పగ రా నీ
చూతాటవి నతని మనము చూతుమె లవుడా'

అని రామాయణార్థము వచ్చునటుల అందలి అశ్లీలము దొలగునట్లుగా పూరించినాడు. పై వాక్యము ఉర్దూభాషనను సరించి యశ్లీలార్థద్యోతక మైనది. ఈ పదములు వాడుకలో గలవు కావున నే కవి పై అశ్లీలార్థ ద్యోతకమగు సమస్యను సీతాదేవి తన పుత్రుడైన లవునితో చెప్పిన వాక్యములుగా సరసరీతిని పూరించి అశ్లీలార్థమును దొలగించినాడు.

పదసంఘాత సమస్య: కొన్ని పదముల నిచ్చి వానిని పద్యమునందుంచి ఏదో యొక నిర్దిష్టార్థమును తేర్చునటుల పూరించుటకు నిచ్చెడి దానిని పదసంఘాత సమస్యఅందురు. గోలకొండ, మాలముండ, పూలదండ, 'కొత్తకుండ' అనునవి పదసంఘాతములు. పై పదములతో భారతకథా సందర్భము దేర్చునట్లు పూరించమని పెద్దనామాత్యునకు ఇవ్వగా

'ఓయి! ధృతరాష్ట్ర! నీకొడుకుత్తగోల
కొండవలెనుండు క్షణమాల ముండ దికను
భండనంబున గెల్తురు పాండుసూను
లుదరమున పూలదండ రేకొత్తకుండ'

అని చతురముగా పూరణముచేసి తన పాండిత్య ప్రతిభలను వెల్లడించుచున్నాడు.

నిషేధ పూర్వక సమస్య: అవధానాది సమయములందు పృచ్ఛకు డొక సమస్య నిచ్చుచు దానిని పూరించుటలో గొన్ని పదములను నిషేధించుటను నిషేధపూర్వకసమస్య అందురు. ఒకపృచ్ఛకుడు 'కోడిని బ్రాహ్మణుడు పట్టి గుటుకున మింగెన్' అను సమస్యనొక కవికిచ్చి పూరించునపు డందు 'పకోడి' యను పదము రాగూడదని నిషేధించి పూరించమనగా పూర్వులొకరు

పోడిమి మిఠాయి జేసెడు
వాడొగిజక్కెరచిలుకల వాజులహరులన్
గోడిగముల బోయగ నొక
కోడిని బ్రాహ్మణుడు బట్టి గుటుకున మింగెన్'

అని పూరించినారు. ఇది నిషేధపూర్వకసమస్య.

నిర్దిష్టపదసమస్య: ప్రాసస్థానములో కొన్ని పదముల నిచ్చి వానిని పద్యములోనుంచి నిర్దిష్టార్థము వచ్చునట్లుగ పూరించు మనుట నిర్దిష్ట పదసమస్య. నగరు, తగరు, తొగరు, వగరు అను పదములను ప్రాసస్థానము నందుంచి నిర్దిష్టార్థము వచ్చునటుల పూరణము చేయుమని పెద్దనకు శ్రీకృష్ణదేవరాయలవా రిచ్చిరట. అపుడు పెద్దన రామాయణార్థము వచ్చునటుల

'నగరు' పగారెను నింక విపి
నంబుల కేగుము రాజ్యకాంక్షకున్
'దగరు' కుమారులార యని
తల్లి వగల్ మిగులంగ దోపగాఁ
'దొగరు' న రక్షగట్టి మది
దోచక గద్గదఖిన్న కంఠియై
'వగరుచు నున్న జూచి రఘు
వంశవరేణ్యుడు తల్లి కిట్లనెన్

అని పూరించినాడు ఇట్లే పలువురు కవులు భారత భాగవతార్థములు వచ్చునట్లుపూరణము చేసినారు.

సరళ సమస్య: వికృతార్థద్యోతకమును గాక సరళార్థద్యోతక మగు సమస్యలును గలవు. కవిత్వము నందలి పటుత్వమును కనుగొనుటకై యిట్టి సమస్యలీయబడును.

'సంభ్రమమున సీత పెండ్లి జనకుడు చేసెన్' అను నది సరళ సమస్య. ఒకపర్యాయ మొక అవధానమున తిరుపతి వేంకట కవుల కీ సమస్య నివ్వగా

సంభ్రాంతు డగుచు హిమనగ
ముం భ్రమరిని హరున కిచ్చు మురిపునఁ దావే
డ్కం భ్రమర హితుం డంతే
సంభ్రమమున సీత పెండ్లి జనకుడు చేసెన్'

అని పూరించినారు.

ఇట్లు అనేక విధములైన సమస్యలను ఎందరో దిగ్దంతులైన మహాకవులు చమత్కారముగా పూరించి తమ వైదుష్యమును జగమున చాటించుకొన్నారు. మహాకవులుసైత మీ సమస్యాపూరణ ప్రక్రియలు చేపట్టుటచే దీనికి మరింత వన్నె చేకూరినది.

కాని నేడు మారుతున్న సమాజమునకు అనుగుణముగా కవితలో గూడా మార్పు వచ్చి, వచన కవిత విజృంభించుటతో దాదాపు ఈ ప్రక్రియ అంతరించినదని చెప్పవచ్చు. కాని అచటచట జరుగుచుండు అవధానములందు మాత్ర మీ ప్రక్రియ తన ప్రాభవమును నిలుపుకొంటున్నది. దీని వలన మనకు మంచి హాస్యమును, లభించును. ఇట్టి కవితా ప్రక్రియ అణగారి పోకుండా చూడవలసిన బాధ్యత ప్రతి సాహిత్యాభిమానిపై కవిపై ఉంది.

—...—



# ప్రబంధపరమేశ్వరుని ప్రతిభ

– శ్రీ కాశీ రామచంద్రరావు.

మహాభారతము నాంధ్రీకరించిన కవిత్రయములో ఎఱ్ఱనార్యుడు తృతీయుడయ్యు కవితా ప్రౌఢి కద్వితీయు డనదగును. కొండవీటి రాజ్యమేలిన ప్రోలయ వేమారెడ్డి యాస్థానకవీశ్వరు డయి విలసిల్లెను. హరిహరాభేద భక్తి గరిమగలవాడు శ్రీ శంకరస్వామి సంయమీశ్వర పాదుకాధ్యాన పరు డగు యోగీశ్వరుడు, శివపదాబ్జ సంతతిధ్యాన సంసక్త చిత్తుడు.' 'శంకరస్వామి గురుండు మాతలఁపు సర్వము దానయి యుండుగావుతన్' అని చెప్పికొనినాడు శంకరస్వామి శిష్యుడగుటచే శంభుదాసు డని సార్థకనామ మేర్పడినది. ప్రబంధరీతిలో భారతారణ్య పర్వశేషమును చమత్కార బంధురముగా రచియించుటచేఁ ప్రబంధపరమేశ్వరు' డనియు, బిరుదనామముగలదు. ఇతని రచనా కాలమును గురించి సహితము వాదోపవాదములు జరిగినవి. రచనాకాల నిర్ణయమున చరిత్రకారుల యందును, పరిశోధకుల యందును, నేకమతము గానబడదు. అట్టి పట్టుల బహు పండిత పరిశోధితసమ్మతమైన యొకానొక కాలము: క్రీ. శ. 128) ప్రాంతములో పుట్టి 1345 వరకు జీవించియుండును.

ఈత డెన్నియోని గ్రంథములు రచించియుండవచ్చును. గాని ప్రకృతము అరణ్య పర్వశేషము, అహోబల మాహాత్మ్యము అను నామాంతరముగల లక్ష్మీనృసింహపురాణము, రామాయణము, హరివంశము, కవిసర్పగారుడము. నన్నయ రచించిన మహాభారత మందలి యారణ్య పర్వపద్యములో 141వదగు 'శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహార పంక్తులన్' తరువాత శరదృతు వర్ణనములో శేషించిన భాగమునుండి యా పర్వాంతము వఱకు 'స్ఫురదరుణాంశురాగరుచి, బొంపిరివోయి నిరస్త నీరద' ఇత్యాది పద్యములు మొదలు 1599 గద్య పద్యములు నన్నపార్యుని పేరితోనే పూరించియు నన్నయవలెనే రాజరాజ నరేంద్రునకే యంకితము గావించి కృతకృత్యు డయినాడు ఎఱ్ఱన. ప్రబంధమున సుచితమైన వర్ణనా సరణి నీతడు పురాణమున కాపాదించినాడు. ఆధునిక జాతీయ వర్ణనాత్మక రచన మనుగుణముగ తనయందు మేళవించుకొని ఎఱ్ఱన అర్వాచీన ప్రబంధ కవిత ధోరణి స్థాపనచార్యు డయినాడు.

అందుకే అతడు ప్రబంధ పరమేశ్వరుడని ఎఱ్ఱ పోత సూరి ప్రశంసించెను. నన్నయభట్టు మహాకవీంద్రు సరససారస్వతాంశ ప్రశస్తిదన్ను చెందుటయు తత్కవితారీతియు కొంతదోప తద్రచనయగా నారణ్య పర్వ శేషము పూరించినవాడుగాన, నెఱ్ఱనార్యుని యందలి కవితలో నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి. అక్షరరమ్యత, ధారాశుద్ధి, సులభాన్వయ సమాసఘటన, కనిపించును.

ఈతడు అరణ్య పర్వశేషము నన్నయ పేర వ్రాయుటయేగాక ఇందులో నాతడు నన్నయగారి రచనావిలాసమును శిల్ప రహస్యము నాకళించుకొని తిక్కనగారి రసాభ్యుచిత బంధమును శైలిని గ్రహించి యారణ్యపర్వ శేషమునుండి విరాట పర్వమువఱకు కవిత్వపు వంతెన కట్టినాడు. అరణ్యపర్వశేషములో నున్న సావిత్ర్యుపాఖ్యానము 110 పద్యములుగాను, రామకథ అరణ్య పర్వషష్ఠ సప్తమాశ్వాసములలో సుమారు మూడు వందల పద్యగద్యముల కృతిగాను నున్నది. ఇదలి ఘోషయాత్రా ఘట్ట

ములో వ్యక్తమయిన గోరక్తిపై ఎఱ్ఱన కభిమానం మెండని తెలియుచున్నది.

దుర్యోధనుడు కర్ణప్రేరితుండై ద్వైత వనమందు ఉన్న పాండవులను తమ యైశ్వర్య భోగప్రదర్శనమున మఱింత సంతప్తులను గావింప సమకట్టి ద్వైతవన మందలి గోగణమును అచటి క్రూర మృగాదులనుండి సంరక్షింపగోరినట్లు ధృతరాష్ట్రునకు తెల్పినాడు. ఏవిధముగానైన తండ్రిచే అనుమతి పొంది అంతఃపుర స్త్రీ సమూహముతో కలసి మహావైభవోపేతముగా పోయి ద్వైతవన మందలి గంధర్వుల సరోవర సమీపమున శిబిరములు నిర్మింపబోవు నెడ వారిచే అడ్డగింపబడి గర్వముచే వారిని తిరస్కరించి వారితో యుద్ధమునకు సన్నద్ధుడయి; చివరకు ఇంద్రప్రేషితుడగు గంధర్వరాజు చిత్రసేనునిచే స్త్రీ సమూహముతో గూడ బంధింపబడి ఆకాశమునకు కొనిపోబడుచుండగా అతని భటులు ధర్మరాజునకు తెల్పిరి. అతడు వెంటనే భీమార్జునులను పంపి గంధర్వుల చెఱనుండి దుర్యోధనాదులను విడిపించెను.

తమ్ముడగు దుర్యోధనుడు చెఱలో నున్నాడని తెలిసిన వెంటనే ధర్మజుని హృదయము పరితపించినది. ఇప్పుడు సుయోధనుని స్థితియేమి? అతని హృదయమంతయు తారుమారైనది.

ధర్మజునిమాట తమ్ములు కాదనలేక పోయినారు. ధర్మరాజు కుటుంబములోని భ్రాతృత్వము ప్రశంసనీయము. అన్నయానతి నణుమాత్రమయిన నుల్లంఘింపని యాదర్శానుజన్ములు. 'జ్యేష్ఠ భ్రాతా పితృసమః' అనునార్యోక్తి వీరియందు నూరుపాళ్ళు వర్తించినది. అన్నచే అనుజ్ఞాతులైన వెంటనే భీమార్జునుల కరుణారసపూరిత హృదయమంతయు, క్రోధరస పూరితమై వీరరసముగా మారి శరీరమంతయు కంపించినది. ద్రౌపది సభాస్థలి యందు జరగిన యవమానమును వారు మరచిరా? భరింపరాని హృదయవిదారక దృశ్యము పాండవులకు స్మరణకు రాలేదా? దుర్యోధనుని హృదయము ద్రవించినదా? లేదు. అతని హృదయములో కొంత పిరికితన మేర్పడినది. రజోగుణ ప్రధానులకు స్థిరచిత్త మెక్కడిది? మూర్ఖుడు. తమోగుణ మాతని ప్రధాన గుణము. భీమార్జునులు కురుక్షేత్ర సంగ్రామ రంగమున చూపబోవు వీరరసము స్థాయీ భావమునొందుట కిదే ప్రారంభావస్థ కావచ్చును.

ధర్మరాజు ఎంతటిరాజనీతి ధురంధరుడో అంతటి ఆత్మస్థైర్యము గలవాడు. నీతి పారంగతుడు. సకలశాస్త్రార్థకోవిదుడు. ఏమి యీతని సామర్థ్యము? దూరదృష్టి? అన్నింట నీత డద్వితీయుడు. ధర్మగుణమును, ధైర్యసాహసములను బరికింప నీత డసామాన్యపురుషు డని తోపకమానదు. ఎఱ్ఱన శుక్రనీతి, అర్థశాస్త్రము, కామందకము, మన్వాదిస్మృతులు మొదలగు రాజనీతి గ్రంథములను జదివి వానియందు సంపూర్ణ పాండిత్యము గడించినట్లు తెలియుచున్నది. ఎఱ్ఱనకు సత్యనిష్ఠ ఎక్కువగుటచే ధర్మమందభిమాన మెక్కువ. ధర్మవ్యాధ చరిత్రమునందు మానవున కవసరములైన ధర్మవిశేషము లన్నియు అరణ్యపర్వశేషమునం జెప్పబడినవి. ధర్మవ్యాధుడను బోయవాడు కౌశికునకు తెల్పిన ధర్మ విశేషములు చూతము.

తనకులధర్మము వీడక బ్రతుకుట పరమధర్మమని పెద్దలు చెప్పుదురు. మనసున దయ కలిగియుండుట ముఖ్యమైనది. సర్వ విషయములందు నోరిమి యవసరము. సమస్తమైన యింద్రియ భోగాదులందునాసక్తి విడుచుట యవసరము. అట్టివైరాగ్యమును మించిన గుణమును పండితులు చూడరైరి. కాన పరిత్యాగ శీలునకు సాధ్యము కానిది లేదు. సత్యమై హితమయిన పలుకు పలుకుట యుత్తమము. సుజనులనెల్లప్పుడు గౌరవించవలెను. కోపము తొందరపాటు పగ అనువానిచే మనస్సు కలతపడినను ధర్మమార్గము వీడక నడచుట యుత్తమము. కష్టములందు దైన్యము కాని సుఖములందు హర్షము కాని పొందక శుభవర్తనమునందు కోరిక గలిగి యుండుట యావసరము. అపకారముచేసిన వారికి మేలు చేయుటచే పెద్దలు మెచ్చుకొందురు. ఇతరుల కాపదచేయువాడు తన పాపమున తానే కాలి పోవును. అట్టి వానికి కీడుచేయనవసరములేదు. దానము, నిజమాడుట, తపము, యజ్ఞము, ఋజుత్వము, కామము, లోభము, మున్నగు వాటిని విడుచుట, గురుజనులను సేవించుట, కోపము, లేకుండుట, ఇంద్రియనిగ్రహము, సంతోషము, వేదపఠనాసక్తి, డాంబికత్వము లేకుండుట, దీనత్వము నొందకుండుట, అసూయ అహంకారము, తొలగుట, ధార్మికదృష్టి కలిగి యుండుట, నాస్తిక సంభాషణలు చేయకుండుట, శీలము కాపాడుకొనుట, తీర్థయాత్రలు చేయుట, శౌచముకలిగి భూతదయాపరుడై, మితము, హితమునైన మాటలాడుట, ఆశ్రయించిన మిత్రుని కాపాడుట, శిష్టచరితములు. శిష్టమార్గమున అసూయాదులు విడిచినచో బ్రహ్మానందము కలుగునని తెల్పియున్నాడు. తిక్కనకు తన తాతయైన భాస్కరమంత్రి ప్రత్యక్షమైనట్లు శంభుదాసునకు తాత ఎరపోతసూరి భావమున ఆవిర్భవించి 'నాయనా, ఆంధ్రభాషలో అరణ్య పర్వశేషము పూర్తి చేసినావు. ప్రబంధ పరమేశ్వరుడవు ప్రబంధ రచనా ప్రావీణ్యము నీకు సహజ పరిణతి సిద్ధమైనది. అహోబలేశ నరసింహస్వామి నాయిష్ట దైవము. అందుచేత అహోబల తీర్థ మాహాత్మ్యము, నరసింహావతార కథా సీమధురోక్తులతో సర్వాంగ సుందరముగ కావ్యముగా వ్రాయుమని కోరినాడు. తాతకోరికను తీర్చినాడు. ఎఱ్ఱన.

(సశేషము)

# విశ్వనాథ నాయుడు - నారాయణరెడ్డిగారి కవితా వైశిష్ట్యం

– శ్రీ దూర్జటి వేంకటబాలాజీ.

'అంతకడివెడు పాలపై ఒ
క్కింత మీగడ పెరిగినట్లుగ
మనకు మిగులును గతములోపలి
మంచి, అదియే మనసంప్రదాయము'

–అని ఆధునిక తెలుగు కవిత్వానికి ప్రాణభూతమైన సంప్రదాయ కవిత్వపు విలువలను నేటిసాహిత్యలోకానికి తెలియపలచిన నారాయణరెడ్డిగారు అన్నారు. ఈ ధోరణిలోనే మహాకవి శ్రీశ్రీగారు ఒకచోట ఆధునికకవిత్వాన్ని గురించి ఉటంకించారు. ఇంతకూ స్థూలంగా చెప్పవలసిన దేమంటే, ఆధునిక సాహిత్యలోలబ్ధప్రతిష్ఠుడైన ప్రతికవీ సంప్రదాయకవిత్వాన్ని క్షుణ్ణంగా జీర్ణించుకొని ఆధునిక సాహిత్యానికి నాందిపలికాడు. అందుకుదాహరణంగా ప్రస్తుతకావ్యం 'విశ్వనాథనాయడు' మనముందు నిలుస్తుంది.

ఇరవైయోశతాబ్ది ఉత్తరార్ధంలోవచ్చిన వీరరస ప్రధానమైన కావ్యాలలో 'విశ్వనాథనాయకు' అగ్రశ్రేణికి చెందింది. ఈ కావ్య సృష్టికర్తలు డాక్టర్. సి. నారాయణరెడ్డిగారు. ఇరవయ్యో శతాబ్దిలో భావకవిత్వం ముందు పుట్టింది. దీని తరువాత అభ్యుదయకవిత్వం వచ్చింది. ఆ అభ్యుదయపు గాలులను పీలుస్తూ, సంప్రదాయపు వాసనలు చెడిపోకుండా భావకవుల స్నేహపూరితమైన మృదుమధుర కవితాసుగంధాన్ని ఆస్వాదిస్తూ, ఆధునిక రీతులలో కవితకు నాందిపలికిన అతికొద్ది మంది కవులలో నారాయణరెడ్డిగారు అగ్రగణ్యులు.

నారాయణరెడ్డిగారిని తలుచుకొంటే, మల్లెపూలు–వానిలో నిబిడీకృతం కాదగినటువంటి రసాస్వాదనయోగ్యమైన, మృదుమధురమైన కవితాధారలతోకూడుకొన్న అత్యుత్తమ కావ్యాలు గుర్తువస్తాయి. వీరిలో ముఖ్యంగా కొట్టొచ్చినట్టు కనిపించేది భావావేశంతో కూడుకొన్న ఒకరకమైన అభినివేశం–సంప్రదాయబలంతో నిండిన శబ్దశక్తి, పటిష్ఠమైన భావధారతో కూడుకొన్న సన్నివేశ కల్పనలు, సంభాషణాచాతుర్యం. జాతి నుద్దీపింప జేసే ఒకవిధమైన దేశభక్తి పూరితమైన ఉద్వేగం, నారాయణరెడ్డిగారి కవిత్వానికి ఆలంబనవస్తువులు.

'విశ్వనాథనాయడు' కావ్యేతివృత్తం తంజావూరు నాయకరాజులకు సంబంధించింది. రాయల తరువాత తెలుగుసాహిత్యాన్ని ఆదరించేవారు లేకపోవుటచే తెలుగుసాహిత్యం దక్షిణదేశానికి వలసపోయింది. కాని రాయలు పాలించే రోజుల్లో మధురను పాండ్యరాజులు;చోళరాజులు తంజావూరును; పరిపాలించారు. రాయలకు ప్రీతిపాత్రులైన పెక్కుమంది దళవాయిలలో నాగమనాయడు ఒకడు. ఇతనిభార్య పేరు మల్లికాంబ. ఈ దంపతుల కుమారుడే మనకావ్య కథానాయకుడు విశ్వనాథనాయకుడు.

కావ్యాన్ని ఆరు ఖండాలుగా విభజించడం జరిగింది. ప్రథమఖండంలో నాగమనాయని దంపతులు సంతాన హీనులైపరితపిస్తూ, ఊరివెలుపల ఆలయంలోని విశ్వనాథుని స్తుతించుటకు వెళ్ళారు. దర్శించిన తరువాత ఆలయం వెలుపలికివచ్చిన నాగమనాయని దంపతులు అప్పుడే ఉదయించిన అరుణ కిరణుని చూచి ఎలా పరితపిస్తారో కవి వివరిస్తున్నా డీవిధంగా–

'వెలుతురు పొత్తిళ్ళలోన
కిలకిల మని నవ్వుచున్న
బాలసూర్య బింబమ్మును
ఆలోకించెను నాయడు
గూటినుంచి వెల్వడు చిరు
కొమ్మమీద కూర్చొని తన
నిసుగుచుంచు దువ్వెడు పెం
టిని జూచెను మల్లికాంబ.

నాగమనాయని దంపతులకు సంతానం లేదు. వారు సంతానంకొఱకు ఎదురుచూచేవారు, ఆలయం బయటకు వచ్చినప్పుడు, ప్రాతఃకాలాన్నే ఉదయిస్తున్న బాలభానుడు, అప్పుడే పుట్టిన బిడ్డను పొత్తిళ్ళలోనికి తీసుకొనివస్తూంటే ఏ విధంగా ఉంటాడో అలా ఉన్నాడట. ఈ ఉపమానం చాలా సహేతుకంగా ఉంది. నాగమనాయని దంపతులు సంతానంకొఱకు నిరీక్షించుచు ఆలయం వెలుపలికి వచ్చుటతోడనే కనిపించిన యీ దృశ్యాన్ని కవి ఆవిధంగా అన్వయించడం ఒకవిశేషం. సహజంగా మనం ఏదైనా ఒకవిషయాన్ని గురించి ఆలోచించేటప్పుడు ఆ ఆలోచలకు సంబంధించిన దృశ్యం మనకళ్ళెదుట కనబడితే మనకు ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. ఇదీ కవి భావన. తరువాత కొంతకాలానికి విశ్వనాథదేవుని అనుగ్రహంవల్ల నాగమనాయని దంపతులకు మగసంతానం కలగడం, అతనికి విశ్వనాథు డనిపేరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచడంతో మొదటి ఖండం ముగుస్తుంది.

ఇక ద్వితీయ ఖండంలో విశ్వనాథదేవుని అభివృద్ధిని వివరిస్తాడుకవి. ఉత్తమ దంపతుల కెప్పుడూ ఉత్తమసంతానం లభిస్తుందనుట కుదాహరణంగా విశ్వనాథుని పేర్కొనవచ్చును. దినదిన ప్రవర్ధమానుడైన విశ్వనాథుడు సకలరాజోచితమైన యుద్ధవిద్యలను నేర్చుకొని పలు

పురి మన్ననలకు పాత్రుడౌతాడు. పురిటింట్లోనుండి పుణ్యకార్యాల వరకు ఎదిగిన విశ్వనాథుడంటే అందరికీ ప్రేమాభిమానాలు ఉండేవి. నాగమనాయని కుమారుడు బహుముఖ ప్రజ్ఞావంతుడు, అందగాడు, రణపండితుడన్న విషయం చివరకు రాయలదాకా వెళ్ళింది. అందుకే అతన్ని పిలిచి సేనాధిపతి ఉద్యోగమిచ్చాడు. విశ్వనాథుడు రాయలపట్ల రాజభక్తిని ప్రకటిస్తూ రాయలు చెప్పిన ప్రతికార్యాన్ని నెరవేరుస్తూ వచ్చాడు. అప్పుడు నాగమనాయుడు తనకుమారుని ఏవిధంగానైనా రాజును చేయాలనే కోరికను కలిగియుండి ఆ అదను కొఱకు ఎదురుచూస్తూ వచ్చాడు. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లుగా చోళరాజుచే తరుమబడి రాజ్యాన్ని కోల్పోయిన పాండ్యుడు రాయలను ఆశ్రయించడం, రాయలు నాగమనాయని పంపడం జరిగింది. యుద్ధానికి తరలివెళ్ళిన నాగమనాయనికి అన్నివిధాలా తోడ్పడిన విశ్వనాథనాయనికి తండ్రిలోని ఆంతర్యం తెలియలేదు. కానీ యిది చాలా బాధాకరంగానే కనిపించడంతో ద్వితీయఖండం ముగుస్తుంది. అయితే యీఖండంలో ముఖ్యంగా పేర్కొనదగింది విశ్వనాథుని అభివృద్ధిని కవివర్ణించినతీరు. అతని యుద్ధ విద్యా తత్పరతను కవి యీ విధంగా మనకు వివరిస్తున్నాడు

‘అస్త్రప్రయోగ సమయమునందు విశ్వనాథునిలోన రాజుసద్యుతులు పొంపిరిపోవు కావ్యపఠన రసార్త కాలమున విశ్వనాథునిలోన సత్త్వమ్ము ఘనులు ధునులై పారు ప్రహ్లాద చరితమ్ము పఠియించు నపుడు కన్నులలోన అశ్రుకీలలు శాంతముగనుండు భారతములో రాయబారంపు ఘట్టమును తరచిపొందును రాజ్యతంత్ర విద్యానిధులు మొలక మీసంపు నిగ్గులనాడె విశ్వనాథుడు తండ్రినే మించు కొడుకంచు పేరొందె వత్సముమహర్ష భత్వమ్ము దాల్చినయట్లు అతఁడు దితయావనుండైవిరాజులు మండె.

ప్రహ్లాద చరితమ్ము పఠియించు నపుడు కన్నులలో అశ్రుకీలలు శాంతముగానుండు’ అన్న భావన గొప్పది కదా!

మొలకమీసంపు నిగ్గులనాడె’ అంటే నూనూగు మీసాల నూతన యౌవనంలో అడుగుపెట్టినవాడనియర్థం. ఈకావ్యంలో మొత్తానికి ద్వితీయఖండానికొక ప్రత్యేకత ఉంది.

ఇక కథాగమనాన్ని, చారిత్రక సత్యాన్ని ఒకరకమైన ఒడుపుతో కథను మలుపుత్రిప్పడానికి ఈతృతీయ ఖండం ఉపకరిస్తుంది. తృతీయఖండంలో నాగమనాయని వ్యక్తిత్వానికి మచ్చతెచ్చే సంఘటనలు జరుగుతాయి.

అంటే ముఖ్యంగా నాగమనాయుడు పాండ్యరాజు రాజ్యాన్ని ఆక్రమించిన చోళరాజును ఓడించి తాను సింహాసనాన్ని ఆక్రమించుట, ఇది తెలిసిన రాయలు అతన్ని పిలిపించుట, రాకపోగా తాను ఏస్థితిలో రాజ్యాన్ని స్వీకరించింది. రాజ్యాన్ని స్వీకరించుటకు తాను ఎంతవరకు అవాడన్న విషయాన్ని రాయలకు తెలియపరచుట మొదలగు అంశాలు ఇందులో వ్యక్తమౌతాయి. అంతేకాకుండా రాజాజ్ఞను ధిక్కరించిన నాగమనాయని పట్టి తేగలిగిన సమర్థులగు యువవీరులు ఎవరైనా సభలో కలరా?’ అని రాయలు ప్రశ్నించినప్పుడు విశ్వనాథుడందుకు సమ్మతించి తనకు రాయలపట్ల ఉండే అచంచలమైన రాజభక్తిని వ్యక్తం చేస్తాడు! తుదకు విశ్వనాథుడు తండ్రి కొఱకు వెళ్ళడంతో ఈ ఖండం ముగుస్తుంది.

అరువదేండ్లు మచ్చలేకుండెడి జీవితచరిత్రను నడిపిన తన తండ్రి తుదకు ఏ రీతిగా ప్రవర్తించాడన్న విషయాన్ని వ్యక్తంచేసిన తీరును కవి నేర్పుగా ఎంత హృద్యంగా చిత్రీకరిస్తాడో చూద్దాం!

‘అరువ దేండ్లు మచ్చలేవి
చరితముగల ధీరుడిట్టి
కసుమాలపు పనికెట్టుల
కచ్చెగట్టెనో తెలియదు
కోరిక లుడిగిన వయస్సు
లోరాజ్య మ్మందుకొనా
ఊహకంద, దైనను వ్యా
మోహామునకు వయసేమిటి?!’

తండ్రిప్రవర్తనను గురించి బాధపడిన విశ్వనాథుడు తండ్రి మీదకు యుద్ధానికి వెళ్తాడు. అందులకు తండ్రిఎంతో ఆశ్చర్యపోతాడు. విలపిస్తాడు. కానీ రాజాజ్ఞను ధిక్కరించిన వ్యక్తికి ఇంతకంటే ఇంకేమి శిక్ష వేసినా పాపంలేదని తనమనసులో అభిప్రాయపడతాడు. నగరం పొలిమేరలలో ఉండే, తండ్రికి వర్తమానాన్ని పంపడంవిశ్వనాథుని అచంచలమైనరాజభక్తికి ఉదాహరణంగా పేర్కొనవచ్చును. నాగమనాయడు విశ్వనాథుని లేఖను చదువుకొని నిర్విణ్ణుడు కావడం తుదకు రాజాజ్ఞను సైతం ధిక్కరించుటకు సిద్ధ పడడం దీనితో కథ క్రొత్తమలుపు తిరుగుతుంది. ధర్మాధర్మాలమధ్య జరగిన సంఘర్షణను తృతయ ఖండంలో చిత్రీకరించుటే కవి ఉద్దేశమని చెప్పవచ్చును.

(సశేషం)

# ఇంటింటి పద్యాల్లో ఇంటాయన

— శ్రీ కే. వి. రమణారావు, ఎం. ఏ.

నేటి తెలుగు కవిత్వాని కిదీ నిర్వచన మని చెప్పడానికి వీలులేనంత చిందరవందరగా వుంది. తెలుగు కవిత్వాన్ని పాఠకులకు సాధ్యమైనంత దూరంగా తీసుకుపోయే ప్రయత్నం ఎక్కువగా జరుగుతోంది. కవిత్వం అందరికీ అర్థంకానక్కరలే దని కొంతమంది వాదన. అందరికీ అర్థమయ్యేటట్లు చెప్పితే తనని 'కవి' అని పండితలోకం అంగీకరించదేమో అని కొంత మంది అభిప్రాయం. నిజానికి కీర్తిలో కవిత్వం చదివే వాళ్ళ కంటే రాసే వాళ్ళే ఎక్కువగా ఉన్నారని చెప్పవచ్చు. రోజుకి రెండు మూడు కథలు, నవలలు రాసేవారు కూడ వున్నారంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. రాసిన వారే మరొకసారి చదువుతారా? అంటే 'చదువుతారు' అని చెప్పడానికి మనం కొంచెం ఆలోచించాల్సిందే. నాటి కవిత్వం సంఘ శ్రేయస్సు కోసం పాటుపడితే నేటి కవిత్వం తన శ్రేయస్సు కోరుకుంటుంది. ఎవరైనా ఏదైనా అంటే

1 'స్వార్థం లేకుండా వ్యక్తి లేడు
వ్యక్తి లేకుండ సమాజం లేదు
సమాజం లేకుండా భగవంతుడే లేడు'

అనేస్తారు.

కాని ఆరుద్ర అలాంటి వారి తెగకు చెందిన వాడు కాడు. తన కవిత్వాన్ని అతి సులభశైలితో పామరులకు సైతం వినగానే అర్థమయ్యే సౌందర్యరూపంలో తీర్చిదిద్దాడు. ఈయన రచనల్లో సునిశితమైన హాస్యం ఒక ప్రత్యేకత. గాయపు మందు కత్తికేరాని గాయానికి పూయించినట్లుంటుం దీతని హాస్యం.

కుటుంబంలో తండ్రి, భర్త కొవ్వొత్తుల్లాంటివా రట. కొవ్వొత్తి తాను మండిపోతూ అందరికీ వెలుగు నిస్తుంది. అవును మరి, భర్త సంసార బాధ్యతలన్నీ భరించాలి కదా! పెళ్ళయిన తరువాత కొంతకాలం భార్యతో హాయిగానే కాపురం చేస్తాడు. దాని పర్యవసానం పిల్లలు. పిల్లలు పుట్టనంత వరకు భార్యకు భర్తే లోకం...పిల్లలు పుట్టాక. ముందు పిల్లలు తరువాత భర్త. అన్ని పనులు ముందు పిల్లలకే చేస్తుందని

'మాటవరసకి మాయింట్లో నేను యజమాన్నే' అని మొదలు పెడతాడు ఉడుకు మోత్తనం.

'స్కూలు కెళ్ళే పిల్లలే ముందు చేయాలి
స్నానం
బాత్రూం క్యూలో నాన్నదే కడపటి
స్థానం
నాన్నకి సమయానికి దొరకని వస్తువులు
ఎవ్వన
అమ్మాయిలు హడావుడిగా వాడిన తల
నూనే, దువ్వెన!

అని తన గోడు చెప్పుకొని

'చిన్నారి నియంతల్ని సేవించే ఉద్యోగి
ప్రతినాన్నా దినం దినం మహావీర్ త్యాగి'

అని తన్ను తాను సమాధాన పరచుకొంటాడు.

శనివారం సెలవు వచ్చింది. సర్దాగా భార్యతో సినిమాకి వెళ్దామనుకొంటాడు. సాయంత్రం ఆరుగంటలాటకి వెళ్దామని ఉదయం ఆరుగంటలకే నోటీసు ఇస్తాడు. కాబట్టి సాయంత్రం 5 గంటలకే తయారయింది, పిల్లల్ని పక్కింటావిడికి అప్పచెప్పి బయలుదేరబోతుంది భార్యామణి. ఇంతలో

'చెప్పుల్లో కాళ్ళు పెట్టుకొని వెంటనే తీసేస్తుంది' ఎందుకో తెలుసా?

'పాలగిన్నె మూత పెట్టకపోతే గండుపిల్లి తాగేస్తుంది' అందువలన లోపలికి వెళ్ళి పాలగిన్ని మీద మూత పెట్టి దాన్ని అల్మారులో పెట్టి, అల్మారుకి గడియ పెట్టీ, అరగంటలో బయటకు వస్తుంది. కాని 'వీధి గుమ్మం దగ్గర కొచ్చి మళ్ళా లోపలికి వెళ్తుంది' 'ఎందుకే మళ్ళా ఏ మొచ్చింది?' అని భర్త విసుక్కుంటాడు.

'పెరటి తలుపులకు వేసిన గడియలో కొంచెం వెల్తుంది' అని చెప్పి, వెళ్ళి చూసి వస్తుంది.

మొత్తమ్మీద ఇల్లు వదలి రోడ్డు మీదకు వస్తారు. 'రిక్షామీద పోదాం' అని భర్త బిల్లు పెడతాడు. కాని భార్యగారు బిల్లును ఆమోదించక పోవడంతో నడకే కొనసాగిస్తాడు భర్త. అందుకు గాను భార్య గారు రోడ్డుమీదే భర్తకి తిట్లు వడ్డిస్తారు. అంత తొందరగా వడిస్తే తను ఎత్తు చెప్పుల మీదనుండి జారిపోదు? వళ్ళంతా చెమట పట్టి పౌడరు కరిగి

పోదు? పాపం ఈ విషయాలు భర్తగారి కేమి తెలుసు ... ఇలా హంస నడక నడిస్తే.

‘ఆరుగంటలాటకే అసలు బైల్దేర్తాం
ఆ తరువాత షోకే మేం తేల్తాం’

అని గొణుక్కుంటాడు. మొత్తంమీద రెండో ఆటకు హాలుదగ్గరకు చేరతారు. టిక్కెట్ తీద్దామనుకుంటే మర్చిపోకూడందే వాళ్ళు మర్చిపోయారట.

‘ఇంతకీ ఏం మరచిపోయామో మీకేం
తెల్సు
ఇనబ్బీరువాలో ఆవిడ దాచిన మనీ పర్సు

ఆ సమయంలో జైలుకి వెళ్ళినాసరే ఆమెను హత్యచేసేయాలనిపిస్తుందా భర్తగారికి. కాని అంత ధైర్యం అతని కెక్కడిది?

సరే ఈ వారానికి అదృష్టంకే దనుకొని తర్వాత వారం తయారవుతారు. కాని ఈసారి మొన్న వారం జరిగిన తప్పులేవీ జరక్కుండా జాగ్రత్త పడతాడా భర్త. ఆరుగంటలాటకని మూడు గంటలకే బయలుదేరుతారు. మొత్తమ్మీద హాలు దగ్గరకెళ్ళి అతి కష్టంమీద టిక్కెట్టు సంపాదించి, ‘హమ్మయ్య’ అని సీట్లలో కూర్చుంటారు. సినిమా మొదలయింది కాని భర్తగారికి ఏమీ కనబడటం లేదట. ఎందుకో చెప్తున్నాడు.

‘సినిమా చూస్తున్నప్పుడు నాముందు సీట్లో
కూర్చునే వాడల్లా కింగ్ కాంగ్’

పాపం. అంత స్థూలకాయం భర్తగారి ఎదురుగానే కూర్చోవాలా! కూర్చుంటే కూర్చున్నాడు గాని ఒక్కొక్కసారి తలని అటూ ఇటూ ఆడిస్తుంటాడు.... అప్పుడు మాత్రం

‘కరుణించి కనబడే చిత్రం రూపాయలో బేడ’ అట. పోనీ బొమ్మలెలాగూ కనబడటం లేదుకదా అని పాటలైనా విందామనుకొంటే

‘సుమ్మా ఇరక్క మాటూర్’ మాటాడే అరవ అమ్మలక్కలు గొడవట, పోనీ ...

‘ముందు సీట్లో కూర్చోకూడదా
అందమైన ఆడపిల్ల
హాయిగా చూడొచ్చు ఆమె
ఊగే లోలక్కు’

అనుకుంటే –

‘పొందరాని అనుభూతి
పొందే వేళలో పక్క
నుంటుంది భార్య,అదేనయ్యా మఃలక్కు’

అని తన దురదృష్టానికి తానే విచారిస్తూ సినిమా అయినతరువాత నీరసంగా ఇంటికి చేరుకుంటాడు.

కొంతకాలానికి సంక్రాంతి పండుగ వచ్చింది. అసలే డబ్బులేక పాపం తను సిగరెట్లకు బదులు బీడీలు కాలుస్తుంటే జాలిపడడం ఎలాగూ లేదు. పండక్కి కొనాల్సిన వస్తువుల లిస్ట్ చేతికిస్తుంది.

‘పండక్కి అందరికీ అన్నీ కొనాలా? ఔను
కడసారి దానికి ఖరీదైన వెల్వెట్ గౌను
రెండో దానికి జరీ ఉన్న పట్టు పరికిణీ
మొదటి పిల్లకు ముచ్చటైన నైలాన్వోణీ
భార్యారత్నానికి కంచి పట్టు చీర’

ఆ లిస్ట్లో తనపేరుందేమో అని వెతుక్కున్నాడు. కాని, పాపం తనకు మాత్రం రోజూవంకాయకూరే దాంతో భర్తగారి కెక్కడలేని కోపం వచ్చేసి ఆలిస్ట్ను ఆమడదూరం విసిరేసాడు. దాని పర్యవసానం మామూలేగా భార్యగారు మూడంకవేసారు. రాత్రికి బతిమాలడం మొదలుపెట్టాడంతటి భర్త. ఇదే సమయమని భర్తగారు చేయలేని, తేలేని కోర్కెలు కోరేస్తారు భార్యగారు ‘చేయలేను’ ‘తేలేను’ అని చచ్చినా అనరు... అన్నీ ఒప్పేసుకుంటారు ...కాని తెల్లారితేమామూలే ‘ఈరోజు ఆఫీసులో పనెక్కువనో ... పెద్దాఫీసర్ వచ్చాడనో ... లేదా మరొకటి ... చెప్పడం పరిపాటి. అందుకు భార్యగారికి ఎక్కడలేని కోపం వచ్చేసింది. రాత్రి ప్రేమగా తన్ను చేరిన భర్తతో

‘అర్థం చేసుకోరు భార్యలను భర్తలు
వీళ్ళ కర్మానికి వాళ్ళే నిజంగా కర్తలు’

అంటుంది. అయినా ‘తేలు కుట్టిన దొంగలా’ నోరెత్తడు మగడు.ఆమె ఎత్తిపొడుపులకు, నిందలకు కామాలే గాని ఫుల్స్టాపులుండవుకదా! ఫుల్స్టాప్ పెట్టించగలడా ... తను నిస్సహాయుడాయె!

‘పక్కింటి పిన్నిగారి కొత్తచీర సంగతి
ఇంటికి రాగానే చెప్తుంది ప్రేమించే
దంపతి.
ఆయన ఊదిపారేసే పాడు సిగరెట్ల ఖర్చు
ఆవిడచీరలపద్దుకన్నా ఎప్పుడూ హెచ్చు’

అంటుంది. కోపం వచ్చినా ఏమీ చేయలేక పోతాడు. పేదవాడి కోపం పెదవికి చేటుకదా అనుకొని నోర్మూసుకొని ‘ఛీకుక్కా’ అనినా ‘రావేరంభా’ అంటూ బతిమాలుకొని...ఆమె కోర్కెలన్నీ తీరుస్తానని హామీ ఇచ్చి...ఆమెను శాంతపుచ్చి పడుకుంటాడు. కాని మన

సులో పెళ్లాన్ని తిట్టుకుంటూనే వుంటాడు... పైకి తిట్టలేక ... అసలు భార్యలంతా ఇంతే అంటూ

'మనసారా ప్రేమిస్తారు
అనుక్షణం సేవిస్తారు'
కాని —
'భార్యలందరూ భర్తలచేత పన్లు
చేయిస్తారు
బజారుకెళ్ళినప్పుడు కూరల సంచి
మోయిస్తారు
ఉప్పుకొని తీసుకురాగానే పప్పుకోసం
పంపిస్తారు'

అని గొణుక్కుంటూ

'రగ్గు కప్పుకొని హాయిగా పడుకున్నప్పుడు
రసవత్తరంగా అవుతుంది పెరట్లో చప్పుడు
ఆ చప్పుడికి భార్య చప్పున లేచి
'తలుపులు వేశామో లేదో
లేచి చూడండంటే మాత్రం
తక్షణం నులిమేద్దామనుకుంటాను
నా పెళ్ళాం గాత్రం'

కాని ఏం చేయలేక చూసిరావడానికి సిద్ధమవుతాడు. కాని 'ఎవడైన దొంగైతేనో! అని సంశయపడి 'ఎందుకైనా మంచిది నువ్వు కూడారా. అని భార్యను ముందుంచి, తాను వెనక నడచి ... చూసొచ్చి పడుకుంటారు... తెల్లారింది.

సంతలో కుక్కలాగా హడావిడిపడి పోతూ, తనపనులన్నీ పూర్తి చేసుకుంటున్న సమయంలో భార్యగారువచ్చి గోముగా ... 'ఏవండీ ఈ వేళ సాయంత్రం మహిళాపేటలో ఉన్న నాస్నేహితురాలు రాధ ఇంటికెళ్దాం ... తొందరగా వచ్చేయండి.! ' అంటుంది.

'అక్కడకి అన్నీ తననే అడిగి చేస్తున్నట్లు' అని మనసులో అనుకొని ... రానంటే ఇల్లు రణరంగం చేసేస్తుందేమో అని భయపడి, 'సరే' అని ఒప్పుకొని... సాయంత్రం ఎన్ని పనులున్నా ఆపుకొని, త్వరగా ఇంటికొచ్చేసి భార్యగార్ని తీసుకొని రాధ ఇంటికెళ్ళాడు ... ఇక అక్కడ వారిపిచ్చాపాటిలో గంటలు నిమిషాల్లాకాదు, సెకండ్లులా కదిలిపోతున్నాయట ...

మధ్యలో భర్తగారు గుర్తొచ్చినప్పుడు మాత్రం.

'వెళ్లొస్తా రాధా...! వెళ్ళొస్తా!...' అంటుంది కాని తిరుగుముఖం పెట్టదు... భర్తగారు

'మూడో సిగరెట్టు ముట్టించి దగ్గుతా డో దగ్గు' కాని 'ఆయన పెట్టే ఇబ్బందికి ఆవిడ పడబోదు సిగ్గు' చాలా సేపు మాట్లాడి... మాట్లాడి ...

'వెళ్ళొస్తా-వెళ్ళొస్తా-'అంటుంది. నిజమనుకొని భర్తగారు సీట్లోంచిలేచి గేటు వరకువచ్చేస్తారు. భార్యగారు వచ్చినా వరండాలో మజిలీవేసి రహస్యాలు మాట్లాడుతుంటారు. గంటలు, గంటలు అలా నిలబడీ అస్కుకొట్టుకొంటారు... పోనీ

'కూర్చొని కొట్టకూడదా ఈ కుచ్చిటప్పాలు' అనుకుంటాడు. కాని గుర్తించదామె మొగుడవస్థ. ఆమెకేమి బాగానే వుంటుంది. కాని, 'ఇంటాయనకు మాత్రం చచ్చినచావు' అయినా తప్పదుగా ... అలాగే నిలబడతాడు. మొత్తమ్మీద మరో రెండు గంటల్లో ఇంటి ముఖం పెడతుందా భార్యామణి. మరోసారి వచ్చినా పెళ్ళంతో రాకూడదని వెళ్ళిన ప్రతిసారీ మర్చిపోకుండా అనుకుంటూనే వుంటారా భర్తగారు.

ఇలా కుటుంబంకోసం పాటు పడే భర్తగారు నిజంగా 'మహావీర్ త్యాగే' మరి ...

---

1 బోయి భీమన్న 'త్రిపదలు'

— ... —

# ఈ పక్షంలో

## శ్రీ జాషువా సంస్మరణ సభ

18-9-1981 సాయంకాలం గం 5-30 లకు ఆంధ్రాయూనివర్సిటీ అసెంబ్లీ హాలులో శ్రీ ఆవుల సాంబశివరావుగారి అధ్యక్షతను శ్రీగుర్రం జాషువా సంస్మరణసభ వైభవంగా జరిగింది.

ఆంధ్రాయూనివర్సిటీ - జాషువా అభిమాన సంఘానికి సంబంధించిన విద్యార్థులు ఈకార్యక్రమాన్ని నిర్వహించారు. అధ్యక్షుని, ముఖ్య అతిథిని, వక్తలను విల్సన్ వేదికపైకి ఆహ్వానించారు. కుమారి వింధ్యావళి శ్రావ్యంగా పాడిన దేశభక్తి గీతంతో సభప్రారంభమయినది.

అధ్యక్షత వహించిన శ్రీ ఆవుల సాంబశివరావుగారు జాషువకవిత్వప్రతిభను, వ్యక్తిత్వ విశేషాలను సంక్షిప్తముగా తెలియజేసి, ఈనాడు జాషువా కవిత్వాన్ని అందరు చదివి అందులోని సందేశాలను గ్రహించడం ఎంతయినా అవసరమని హితవు నుపదేశించారు.

ముఖ్యఅతిథిగా విచ్చేసిన శ్రీ జ్ఞానానందకవిగారు తమ సుమధుర గంభీర గళంతో జాషువాగారి పద్యాలను కర్ణపేయంగా వినిపించి, జాషువాగారితో తమకున్న పరిచయాన్ని, అనుభవాలను వివరించారు. జాషువాగారు కులాన్ని ఎదుర్కోటానికి కవిత్వాన్ని ఎలాఆయుధంగా చేసుకున్నారో వివరించి సభను రంజింపచేశారు.

ఆచార్య బి. వి. యస్. పాత్రుడు గారు జాషువాకవి గబ్బిలం, పిరదౌశి మొదలైన కావ్యాలలోని కవిత్వ విశేషాలను తెలియ జేశారు.

జాషువాకవిత్వంపై పరిశోధన చేసి పి. హెచ్. డి. పట్టం పొందిన, విజయనగరం మహారాజా కళాశాల తెలుగు లెక్చరర్ డా: జి. బి. యస్. ఆచార్యగారు జాషువాకవికి తమఅక్షరాభిషేకాన్ని సమర్పిస్తూ ఉపన్యాసం ప్రారంభించారు. జాషువాకృతుల్లో ఉన్న సంప్రదాయ నవ్యతలను ఉదాహరణపూర్వకంగా వివరించారు. జాషువాకవి సీసపద్యాన్ని నడిపించిన తీరునుబట్టి, ఆయన అలవోకగా ప్రయోగించిన అన్యదేశ్యాలను బట్టి, ఖండకావ్యాల్లోని వస్తువైవిధ్యాన్నిబట్టి ఆయనకున్న 'మధురశ్రీనాథ' బిరుదు సార్థకమైందని వివరించారు. జాషువకవిత్వంలో ఉన్నసామాజిక స్పృహ, అభ్యుదయధోరణి ఆయనను ప్రజాకవిగా నిలబెట్టినవని చెప్పారు. ఆయన జీవితంలో ముఖ్యంగా ఎదుర్కొన్నసమస్యలు రెండు. అవి ఒకటి పేదరికం, రెండు కులం. మొదటిదాన్ని నిర్లక్ష్యంచేసి రెండోదాన్ని ఎదుర్కోటానికే ఆయన జీవితాన్ని, కవిత్వాన్ని వినియోగించారని, వ్యక్తిగతమైన సమస్యల్ని, వాటి పరిష్కారమార్గాల్ని చిత్రించారని, ఆయనకవిత్వంలో ఉన్న ప్రత్యేకతను వివరించారు. ఇంకా ఆయనకున్న దేశభక్తి, ప్రాచీనకవులపై అనురక్తి మొదలయిన ఎన్నో విశేషాలను, సుదీర్ఘంగా ఉపన్యసించి, సభకు జాషువామహోన్నతకవితామూర్తిని గోచరింప చేశారు.

శ్రీ ఎ. జే. పి. ఏసుదాసు వందన సమర్పణతో సభ విజయవంతంగా ముగిసింది.






## సారంగపాణి పదసాహిత్యం

[రచయిత : డా. యస్. గంప్ప. ఎం. ఏ. పి హెచ్. డి. (సుమారు 170 పుటలు) వెల : రు. 8_00 ప్రాప్తిస్థానము : శశీ ప్రచురణలు, సి_73. శ్రీనివాసనగర్, గుంటూరు. 522006. (లేదా) నవోదయాపబ్లిషర్స్, ఏలూరురోడ్_విజయవాడ_2]

'సారంగపాణి పదసాహిత్యం' అన్న ఈ గ్రంథాన్ని రచించిన డా. యస్. గంగప్పగారు విమర్శరంగంలో గణనీయమైన కృషిచేసిన పండితులు. ఇంతకు ముందు 'క్షేత్రయ్యపదసాహిత్యం' అనే విమర్శగ్రంథం వ్రాసి ఆం. ప్ర. సా. ఎకాడమీ వారి బహుమతి నందుకొన్న ప్రతిభావంతులు శ్రీ గంగప్పగారు.

సారంగపాణి క్రీ. శ. 1680_1750. కాలంవాడు. కార్వేటినగర్ నివాసి. సంగీతవిద్వాంసుడు, కవి, నాట్యాచార్యుడు. పైగా మాకరాజు వెంక పెరుమాళ్రాజు అనే రాజుగారి ఆస్థానంలో విద్యాధికారి.

ఆనగరంలో వెలసిఉన్న వేణుగోపాలస్వామి అంశే సారంగపాణికి పరమభక్తి. స్వామివారిమీద దాదాపు 200 పదాలు వ్రాసి చరితార్థుడైనాడు. శ్రీ గంగప్పగారు వారి పదాలను ప్రధానంగా శృంగార పదాలు, దేశీయపదాలు జాతీయపదాలు, కీర్తనలు_అనే నాలుగు భాగాలుగా వింగడించుకొని క్రమబద్ధంగా విమర్శించి, ఆయా రచనల్లో ఉండే చమత్కారాలను, ఒడుపులను పఠితలకు ప్రదర్శించి సారంగపాణిని క్షేత్రయ్యత్యాగయ్యలతో సమానపీఠంవేసి కూర్చోబెట్టారు.

వీరి విమర్శ చాలా సరళంగా, సముచితంగా సాగి, పరిశోధనాత్మకమై, భావి సాహితీ విమర్శకులకు మార్గదర్శకంగా ఉంది. కాల నిర్ణయం. జీవితవిశేషాలను గూర్చి సమగ్రంగా చర్చించారనే చెప్పవచ్చు. అయినప్పటికీ, 'భావిపరిశోధకులు మరిన్ని విశేషాల్ని కనుగొంటారనీ, సారంగపాణి జీవితానికి పరిపూర్ణత్వంకల్గిస్తారని ఆశిస్తున్నాను' అని రచయిత ప్రారంభంలో చెప్పుకొన్న పలుకులు శ్రీ గంగప్పగారి వినమ్రశీలానికీ, సమ్యగ్విమర్శన దృష్టికి నిదర్శనాలు.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఈగ్రంథప్రచురణార్థం ఆర్థికసహాయం చేసి ఉపకారులైనారు. మంచి విమర్శ గ్రంథాన్ని రచించి శ్రీగంగప్పగారు చరితార్థులైనారు. సాహిత్య ప్రియులు చదివి క్రొత్తవిషయాలు గ్రహింపదగ్గ గ్రంథం; పుస్తక భాండాగారాలకు నిస్తులమైన ఆభరణం.

[సుగుణారాధక]

# తిక్కన - పోతన

- కుమారి అరుణశ్రీ, ఎం. ఏ.

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారొకసారి ప్రసంగవశాన తిక్కన ఆంధ్రకవులలో సూర్యుని వంటివాడనీ, పోతన చంద్రుని వంటివాడనీ చెప్పారు. అంటే ఆంధ్రలోకంలో వీరిరువురూ రెండు వెలుగులన్నమాట. ఆంధ్ర జాతికి వేదాలనదగిన మహాగ్రంథాలను ప్రసాదించిన గురుమూర్తులు. కేవల కవులు కాక ఇరువురూ ప్రవక్తలని చెప్పదగిన ద్రష్టలు. హరిహరాభేదం, నిష్కామ కర్మయోగం తిక్కన ఉపదేశాలు. శ్రీకృష్ణ భక్తియోగం పోతన మంత్రం. తిక్కన ఉపదేశానికి బీజాక్షరాలు 'సోఽహం'. పోతన మంత్రానికి 'దాసోఽహం'. అయినా సిద్ధివేళ పోతనా అద్వైతియే కాని, విశిష్టాద్వైతి కాడు. సూక్ష్మంగా విచారిస్తే ఆంధ్రుల మనః క్షేత్రముల యుగయుగాల నుండి వేరు నాటుకొనియున్న ఈ రెండు ఆధ్యాతిక లక్షణాలు (నిష్కామ కర్మ, జ్ఞాన నిరూఢమైన భక్తి) ఈ ఇరువురు మహాకవులు తమ మహా గ్రంథాలలో ప్రతిఫలింపజేసి, తాము జాతికి ప్రతినిధులుగా నిలబడడమే గాక తమ జాతి ఆధ్యాత్మిక సంపదకు వ్యక్త స్వరూపాన్ని నిలువబెట్టారు.

పోతన జీవితం తిక్కన జీవితంలా పరిపూర్ణమైంది కాదు. ఆయన నిస్పృహత్వం వల్ల ఐహికానుభవం దూరమైంది. ఈ కొరతయే ఆయన కళాదక్షతలోనూ లోటు తెచ్చింది. ఆ ఉభయసిద్ధే తిక్కనను శిల్పపారంగతుని జేసింది. లోకమును, ప్రకృతిని కన్నారజూచి, మనసార అనుభవించిన కవికి కలిగే అనుభవాలు శిల్పనిర్మాణంలో ఎంతో సహాయకారులవుతాయి. దీని పట్ల విముఖతగల కవి, సృష్టికి ప్రతిసృష్టి అనదగిన శిల్పనిర్మాణంలో కృతహస్తుడవడం సంశయాస్పదం. జీవితానుభవమెంత విశాలంగా ఉన్న కవితా ప్రపంచ సృష్టి అంత గంభీరంగా సజీవంగా ఉంటుంది. నిస్పృహులైన కవులు కాల్పనిక లోకాల్ని సృష్టిస్తారుకాని స్వాభావికమైన మానవ లోకాన్ని సృష్టించలేరు. అసలు కళా భేదాలలోనే 1) స్వాభావికమనీ, 2) కాల్పనికమనీ రెండున్నాయి. ఈ రెండిటిలో మొదటిది తిక్కన కళ; రెండవది పోతన కళ. స్వాభావిక కళ అంటే చూచింది చూచినట్లు చిత్రించడం కాదు. అట్టి చిత్రణం శిల్పమే కాదు. శిల్పప్రపంచ మెప్పుడూ జగదతీతంగానే ఉంటుంది. స్వాభావిక శిల్పి ఆ అతీతాన్ని లక్ష్యంగా ఉంచుకొని మానవుని అక్కడికి తీసికొనిపోతూ ఈ వాస్తవ జగత్తుకూడ చూపిస్తాడు. అంటే ప్రత్యక్ష జగత్తును ప్రతిఫలింప జేస్తూనే ఆదర్శ జగత్తును సృష్టించగలడన్నమాట.

ఇక కాల్పనిక శిల్పి ఈప్రపంచాన్ని సరకుగొనడు. అతని లక్ష్యంవలెనే అతని సృష్టీ లోకాతీతం. ఈ ఇద్దరకీకల ఈ భేదం సామాన్య స్థూలధర్మంగా చెప్పిందే కాని ఏకాంత లక్షణం కాదు. తిక్కన పూర్తిగా ఏకాంత వాస్తవిక శిల్పియని గాని, పోతన ఏకాంత కాల్పనిక శిల్పి యని గాని దీని అర్థంకాదు. ఈ భేదం వారి మనోధర్మాలలోనే ఉంటుంది. సహజంగా ఉత్తమనాటక కవి విధిగా స్వభావాన్నే ఆశ్రయించి నడుస్తాడు. ఉత్తమ భావకవి నిరంతర ఆదర్శ జగత్తునే ఆశ్రయిస్తాడు.

'హృదయంలో పొంగి పొరలిన రస భావాలు ఏ పట్టున వట్టిపోనీక ఒకబిందువును సముద్రంగా విస్తరింపజేయుశక్తి పోతనది. వెల్లివిరిసిన భావోద్రేకమును మహాకవి యెంతవరకు నిగ్రహించుకొనగలడో ప్రదర్శించినవాడు తిక్కన.' భావపరిప్లుతి రసస్ఫూర్తికి దోహదమైనట్లే భావ నిగ్రహం కావ్య కళాసిద్ధికి ప్రాథమిక ధర్మం. రసము పేర కళాన్యూనత గాని కళావ్యాజమున రసలోపం గాని కలిగినపుడా రెండూ వర్జనీయాలే. ఆ సామరస్య సంపాదనమే ఉత్తమకవితకు ముఖముద్ర. భావకవులలో పెక్కుమందికి హృదయాలు రస నిమగ్నములైనట్లే దృష్టీ అశ్రుపూరితమవుతుంది. నీరు గ్రమ్మిన ఆ కన్నులతో వారు వర్ణ్యవస్తువును సమగ్రంగా చూడలేరు. అనగా బుద్ధిజ్యోతి మసక మసకలాడి, కథార్పితాలైన వస్తువులను సముచితాంగ ప్రత్యంగ స్థానాది ధర్మాలను చక్కగా చూడజాలదు. తిక్కనకు వలెనే పోతనకును శిల్పసిద్ధియున్నచో ఆయనను మించిన కవి ఈ ప్రపంచంలో ఉండేవాడుకాడు. విధివిలాస మట్టి సమగ్రత నుండనీయదు.

తిక్కనలోకప్రవృత్తిలోవలె కావ్యంలోను వ్యక్తావ్యక్త స్వరూపుడుగా పట్టుపడీ పట్టుపడక నడుస్తాడు. ప్రతివాక్యంలోను ఆయన మూర్తి స్ఫురిస్తూనే ఉంటుంది. మళ్ళీకాదనిపిస్తుంటుంది. ఇక పోతనో సంసారంలో పట్టుబడక పోయినా కవిత్వంలో స్పర్శమాత్రంగానే చేతికందుతాడు. నాటక కవులకును, భావకవులకును, గల ముఖ్య భేదమిదే.

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో గూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.